# తిరుపతి వేంకటీయము

గుండవరపు లక్ష్మీనారాయణ, M. A.,
ఆంధ్రోపన్యాసకుఁడు,
జె. కె. సి. కళాశాల, గుంటూరు-4.

శ్రీనివాస పబ్లిషర్స్,
మహారాణిపేట :: విశాఖపట్నం-2.

# మనవి

ఇది తిరుపతి వేంకటేశ్వర కవుల సాహిత్య జీవిత చరిత్ర.

దీనిలోఁ దిరుపతి వేంకటకవులనోట వారు చెప్పిన పద్యములనే పల్కించితిని. సందర్భానుసారముగా వారి ప్రబంధములలోని పద్యముల నుపయోగించుకొంటిని.

అట్లే కొప్పరపు సోదరకవులచేత, ఆ నాఁటి ప్రముఖ పండితులచేతఁగూడ వారి వారి సొంత పద్యములనే పల్కించితిని. ఇట్లుచేయుట ఔచిత్యమనిభావించితిని.

సాధ్యమైనంతవఱకు చారిత్రిక విరోధములు లేకుండ సన్నివేశములను గల్పించితిని. చారిత్రికముగాఁ దరువాత వ్రాయఁబడిన గ్రంథములలోని పద్యములను గొన్ని ముందు సన్నివేశములలో వాడుకొంటిని. అట్లు వాడుకొన్నపద్యములు కూడఁ గొన్నిమాత్రమే. రసవత్తర పద్యములను వదలలేని లోభగుణమే దీనికిఁ బ్రధాన కారణము.

కథానుకూలముగాఁ గొన్ని పద్యములలోఁ జరణములను మార్చితిని. మచ్చునకు——

నాందీ పద్యములో- "తద్విశేష లవలేశమునైన నెఱుంగలేక కొప్పరములు కుప్పఁగూలఁ బరివాదము నొందిరి రామకృష్ణులున్."

ప్రస్తావనలోని —— "ఒక రాజా ! ఒక పండిత ప్రవరుఁడా......" అను పద్యములోని—— "మతోఁడ వృథావివాదములతో డీకొట్టఁగాఁ బూనెడిన్."

ప్రస్తావనలోని : "ఎవఁడాతండు" అను పద్యములోని—— "నాకవిత్వమున శేమేమో విశేషంబు లక్కవి చేకూర్చుటవల్లకగ్గెనఁట, ఏ గ్రంథమ్ములోఁజేసెరా?"

ప్రథమాంకములోని- "చతురాస్యుండు." అను పద్యములోని "నా సరస్వతికి జోడించున్ శుభారంభముల్."

ప్రథమాంకములోని-"కాశీపండితుఁడై ...." అను పద్యములోని - "చేరితిఁ గొల్వఁబూనఁగ సతీర్థ్యా ! భక్తిభావంబుతో."

"అష్టమాంకములోని-కవనార్థమ్ముదయించితిన్-" అను పద్యములోని —— "సత్కవితాదేశికు దేశికుంగొలుతు స్వాంతంబందు వాక్సిద్ధికై."

అన్న పద్యభాగములు నా కల్పనములే.

ఇవికాక చిన్నచిన్న మార్పులు ఇంకను గొన్ని కలవు.

ఇఁక నేను సంపూర్ణముగా వ్రాసిన పద్యమొకటి కలదు. అది ప్రస్తావనలోని– “కనఁబడు వింతపద్ధతులు....” అను శ్లేషతోఁ గూడిన వృత్తము.

నన్నుఁగూర్చి ప్రస్తావనలోఁ జెప్పికొన్న రెండు కందపద్యములు నావేయని ప్రత్యేకముగాఁ జెప్పఁబనిలేదు కదా !

ఇట మఱియొక ముఖ్యవిషయమును ప్రస్తావించుట నా విధి. అది తిరుపతి వేంకటేశ్వర కవుల గ్రంథములలోని పద్యములను నేను నా నాటకమునందుపయోగించుకొనుటకు అర్థించిన వెంటనే ఆనందముతో నా కాతిథ్యమొసఁగి లిఖితపూర్వకముగా (16–12–1972 Ref. 148) అనుమతించిన శ్రీ చెళ్లపిళ్ల దుర్గాప్రసాదరావుగారి సాహిత్యాభిమానము. వీరికి నా కృతజ్ఞతాభివందనములు.

గుణముల యెడల శతముఖులును, దోషముల యెడల వాచంయములును అగు విద్వాంసులకు నా ప్రయత్నము సంతసమిచ్చునని ఆశపడుచున్నాను.

పరదేవతా పదస్థులఁ
దిరుపతి వేంకటకవుల నదేపనిగా నేఁ
బరిశీలించిన బలవ
త్తర కారణమాకృతిఁ గొని తానయ్యె నిటుల్.

గుండవరపు లక్ష్మీనారాయణ
30-9-'73

# మిత్రుఁడు

తిరుపతి వేంకటీయము నూతన రీతిలో రచింపఁబడిన నాటకము. పఠన పాఠనములకుఁ దగిన పాటవ మిందున్నది. ఇది విద్యార్థులకుఁ దగిన పాఠ్యగ్రంథము.

దృశ్య కావ్యమునకుఁ బ్రదర్శనయే కదా ప్రధాన లక్ష్యము! తిరుపతి వేంకటీయమును బ్రదర్శించుట కష్టమని కొందఱందురు. మేమట్లనుకొనము. ఈ యుగమున పాశ్చాత్య నాటక కళను జూచి మనము నేర్చుకొనవలసిన దెంతయో కలదు. పట్టుదలతోఁ బ్రదర్శించినచో దర్శన యోగ్యముగా నుండు ననుటలో సందేహము లేదు. పై పెచ్చు ఈ నాటకము విజ్ఞాన దాయకము. నాఁటి సాహిత్య చరిత్ర యంతయు చక్కఁగా నవగతమగుచు ఆంధ్రదేశమును తమ పద్య కవిత్వముతో నుఱ్ఱూతలూగించిన తిరుపతి వేంకట కవుల జీవిత చరిత్రను తెలిసికొనవచ్చును. అయోమయ కవిత్వములోఁబడి, పద్య కవిత్వపుఁబస తెలియని వారికిది యవసరము. ఈ గ్రంథమును జదివిన వారికి మన పద్య కవిత్వ మాధుర్యము తెలియును

మా మిత్రుఁడైన శ్రీ గుండవరపు లక్ష్మీనారాయణ దీని కర్త. మంచి మనసునుండి మంచి యూహలే పుట్టును. ఇది మంచి పుస్తకము. మంచి పుస్తకమునకు మించిన మిత్రుఁడు లేఁడు గదా!


పులిచెర్ల సాంబశివరావు యం. ఏ.,

గొల్లపూఁడి ప్రకాశరావు, యం. ఏ.

ఆంధ్రోపన్యాసకులు

(జాగర్లమూడి కుప్పుస్వామి చౌదరి కళాశాల)

శ్రీ మత్పర దేవతాయైనమః

# పీఠిక

దివాకర్ల వేంకటావధాని,
( తిరుపతి శాస్త్రిగారి కుమారుఁడు )
నవుడూరు, పశ్చిమ గోదావరి జిల్లా.

"తిరుపతి వేంకటీయ" మను శీర్షికతో వెలువడిన యీ నాటకమును విరచించిన వారు శ్రీ గుండవరపు లక్ష్మీనారాయణగారు. వీరు గుంటూరు జె.కె.సి కళాశాలాంధ్రోపన్యాసకులు పండితకవులు. వీరు తిరుపతి వేంకటకవుల శిష్యకోటిలోఁ జేరినవారు కాకపోయినను వారనిన భక్తి ప్రపత్తులున్నవారు. ఈ నాటకమేకాక 1969 సెప్టెంబరునెల భారతిలోఁ దిరుపతి వేంకటకవుల సంప్రదాయ చమత్కారములను నొక వ్యాసమును, 1973 ఆగస్టు నెల స్రవంతి మాసపత్రికలోఁ దిరుపతి వేంకట కవుల రచనా విభాగమను నొక పెద్ద వ్యాసమును బ్రకటించియున్నారు.

"ఇరువదవ శతాబ్దమ్మునఁ జరించినట్టి సుకవీంద్ర చరితమ్మిటు లె
వ్వరు నాటకమ్ముగ రచింపరు నేఁబూవితిని క్రొత్త పద్ధతి యనుచున్"

అని ప్రస్తావనలో వీరు వ్రాసికొనినారు కవీశ్వరుల చరిత్రను నాటకముగా వ్రాయుట తెనుఁగునకుఁ గ్రొత్త పద్ధతియే. ఈ పద్ధతికి నాందీ ప్రస్తావన గావించిన వారు కీర్తిశేషులు శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రిగారు. శాస్త్రిగారు శ్రీనాథుని జీవిత చరిత్ర నొక నాటకముగా వ్రాసిరి. ఇరువదవ శతాబ్దములోఁ జరించిన కవి చరితమును నాటకముగా మొదటగా వ్రాసిన యశస్సు శ్రీ లక్ష్మీనారాయణ గారిదే.

తిరుపతి సాహచర్యమునఁదేజము నీ కలరారె నాతఁడున్
గురువని నిన్నుఁగొల్చి కవికుంజరుఁడై యశమందె నిర్వు రొ
క్కరె యనిపించెఁ గావ్యముఁ గల్గ నిజంబయి నిల్చి రొక్కరున్
దిరుపతి వేంకటేశ ! గురుసేవ ! నమస్కృతులన్ గ్రహింపుమా !

ఈ పద్యము నేను వేంకట శాస్త్రిగారి నాంధ్రాస్థాన కవులుగా నియమించి నప్పుడు చెప్పికొనినది. ఇప్పటికినిఁ దిరుపతి వేంకటేశ్వరులనిన నొక్కరే యని

ప్రభవించు వారు కలరు. ఈ జంట కవుల పేరులో మొదటి వారు దివాకర్ల తిరుపతి శాస్త్రిగారు. వీరు మా తండ్రి గారు. రెండవ వారు చెళ్లపిళ్ల వేంకట శాస్త్రిగారు. వీరు మా గురువుగారు. నాన్నగారు పశ్చిమ గోదావరి జిల్లా భీమవరము తాలూకాకుఁ జెందిన యెండగండియను గ్రామమున శేషమా వేంకటావధాని పుణ్య దంపతులకుఁ బ్రజోత్పత్తి నామ సంవత్సర ఫాల్గుణ శుద్ధ దశమీ బుధ వారము నాఁడు (1872) జనియించిరి. వేంకట శాస్త్రిగారు తూర్పు గోదావరి జిల్లా లోని ధవళేశ్వరమునకు సమీపముగా నున్న కడియము గ్రామమునఁ గామయ్య గారికిని జంద్రమ్మ గారికిని బ్రమోదూత నామ సంవత్సర శ్రావణ శుద్ధ ద్వాదశీ సోమవారము నాఁడు (1870) జనియించిరి. ఒకరిది వెల్నాటి వంశము. రెండవ వారాము ద్రావిడ శాఖ వారు. వీరు కారణ జన్ములు. 19 వ శతాబ్ది యుత్తరార్ధ మున జీర్ణావస్థలో నున్న యాంధ్ర భాషను గవిత్వము నుద్ధరించుటకు వీరవతరించు టావశ్యకమైనది. లేనిచో వేర్వేరు మండలములలో వేర్వేరు శాఖలలో జన్మించిన యిర్వురేకమై యర్ధ శతాబ్దమునకుఁ బైఁగా నాంధ్ర కవితా సామ్రాజ్యము నేలి కొనుట పొసంగునదికాదు. ఇది భగవత్సంకల్పము. 'అడవి యుసిరికాయ యల సముద్రపు టుప్పు గలియు రీతి మైత్రి కలిగెమా' కని కవులే తెల్పికొనినారు.

'ఒక్కొక చోట నొక్కొకరి యొద్ద నొకాకొక్క మాట చొప్పునన్ జక్కఁగ సంగ్రహించి' జంట కవు లిర్వురును గాశీపండితులై తిరిగి వచ్చి తాడేపల్లిగూడెమునకు సమీపము నందున్న కడెమ్ల గ్రామమునఁ బాఠశాలను నెలకొల్పి శిష్యులకు వ్యాకరణమును నేర్పు చర్ల బ్రహ్మయ్య శాస్త్రిగారి యొద్ద నా శాస్త్రము నభ్యసించుటకుఁ జేరకొనిరి. నాన్నగారి కన్న వేంకట శాస్త్రిగారైదు మాసములు వెనుకగా గురు సన్నిధిని జేరిరి. అప్పటికే వేంకటశాస్త్రిగారికిఁ దెనుఁ గులోఁ గవిత్వము చెప్పుటలవాటైనది. నాన్నగారి కందుఁ బ్రవేశము లేదు. విద్యాభ్యాసకాలములోఁ జేతఁ బొత్తము బట్టి చదువక పోయినను త్వంకా రోక్తులతోఁ బ్రసంగించుచు వేంకట శాస్త్రిగారి యొద్ద ఛందోరహస్యముల నాక ళించుకొనిరి. అటు పిమ్మటఁ గలసి పుస్తకములు వ్రాసిరి. 'గోచి పెట్టకముని కోమల కవితఁ జెప్పినవాఁడు సహపాఠి వేంకట కవి'యని నాన్నగారు తెల్పి కొనిరి.

తిరుపతి వేంకటకవుల శతావధానములు కాకినాడతోను, రాజసందర్శనములు వెంకటగిరితోను బ్రారంభమైన వి. కాకినాడ శతావధానము ఖర సంవత్సరమున

(1891). వేంకటగిరి రాజ సందర్శనము విజయనామ సంవత్సరమున (1893) జరిగినవి. అటు గద్వాలిటు చెన్నపట్టణము మధ్యఁగల్గు దేశమ్ములను. దూర్పున బరంపురము వఱకును దిరిగినారు. 1896 వ సంవత్సరమున వీరి కెవ్వరో వ్రాసిన యుత్తరము ననుసరించి విజయనగర మానంద గజపతి దర్శనార్థమై వెడలినారు. ప్రభువు మహా విద్వాంసుఁడు. ఆస్థానములోని పండితు లొక్కొక్క శాస్త్రమున నుద్దండులు. బహుకష్టము మీఁద రాజ దర్శనము జేసికొని —

ఎందరి జూపెనేవి వరియింపదు మా కవితాకుమారి క
న్నందుకు దేశము ల్తిరుగుటబ్బెను సౌఖ్యము సున్నయయ్యె నా
నంద నృపాల ! నీదు సుగుణంబులఁ దెల్పిన నా కించి వెం
టం దలయూచెఁగావునఁ దటాలున దీనిఁ బరిగ్రహింపుమా.

యని తెల్పి నృపునిచే సన్మానితులైనారు. తిరుపతి వేంకటకవులు గద్వాల కేఁగినది మన్మథనామ సంవత్సరము (1896). ఆత్మకూరు సంస్థానమున రాజ వరేణ్యుని యానతిచే శ్రీనివాస విలాసమును దెనిఁగించి దాని నాతనికిఁ గృతి యిచ్చి హేవిలంబి నామ సంవత్సరమున (1898) గజారోహణోత్సవము జరిపించుకొనినారు. నాన్నగారు తమ వివాహ సందర్భమున సంభవించిన మిత్రుని ప్రణయగాథ నితివృత్తముగాఁ గైకొని వ్రాయుటకుఁ బ్రారంభించిన శ్రవణా నందమును బూర్తిచేసిరి. ఆ కావ్యమును బీరికాపుర సంస్థానామాత్యులైన వాడ్రేవు వేంకటరత్నముగారికి విలంబినామ సంవత్సరములోఁ గృతి యిచ్చిరి (1899). అది విని పోలవర సంస్థానాధీశ్వరులై కాకినాడలో నివసించుచున్న కొచ్చెర్లకోట రామచంద్ర వేంకట కృష్ణారావుగారు కవులను దమయొద్దకుఁబిలిపించుకొని యింగ్లీషులో నార్నాల్డు కవి రచియించిన 'లైట్ ఆఫ్ యేషియా'యను గ్రంథము నొసంగి దానిలోనున్న బుద్ధుని చరిత్రమును దెనుఁగులో రచించి తమకుఁ గృతి యిమ్మని కోరిరి. సంస్కృతములో నశ్వఘోషుఁడు రచియించిన బుద్ధ చరిత్రము లోని కొన్ని శ్లోకములననువాదమొనర్చి యీ బుద్ధ చరిత్రమున గలిపికొని యీ కావ్యమును శార్వరి సంవత్సరమున (1901) బోలవర భూపాలున కంకితమిచ్చి —

తిరిగితిమెల్ల దేశములదేవనిగా నిఁకమీఁద దేశ సం
చరణ మొనర్పఁగావిసువు చాలమనంబునఁ గల్గెనయ్య యీ

తిరుపతి వేంకటేశ కవిధీరుల నొక్కెడనుండఁజేసి భూ
వరసభలందు ఖ్యాతిఁ నవశ్యము పొందుమి కృష్ణభూపతీ ।

యని వేడికొనిరి, కృష్ణారావుగారందుల కంగీకరించిరి. నాన్నగారాశార్వరి సంవత్సరమునఁ గాకినాడకు మకాము మార్చికొని కృష్ణారావుగారు నడపుచున్న సరస్వతి యను మాస పత్రిక భారమును వహించిరి. 1903 సంవత్సరమున వేంకటశాస్త్రిగారు బందరు హిందూహైస్కూలులో నాంధ్రోపాధ్యాయ పదవి నధిష్ఠించిరి.

అప్పటినుండియుఁ దిరుపతి వేంకటకవుల పృథగ్రచన లారంభమైనవి. 'ఒక్కరు రచియించిరేనియునుగాఁనగు దిర్పతి వేంకటీయమై' యని కవుల ప్రతిజ్ఞ. దానికినిసుమంతయు భంగముకల గలేదు. ఈ కవులార్జించుకొనిన యశస్సును భారత నాటకములు స్థిరీకరించినవి. అవి యీ కాలమున రచించినవే. అందును మొదట వెలువడినది పాండవ విజయము. కారణాంతరముల వలన వేంకటశాస్త్రి గారు విజయమునుద్యోగ విజయములను రెండు నాటకములుగా విభజించిరి. ఇట్లిరువురును జేరి యొకచోట నివసించుచున్న కాలమువందే వీరికి రామకృష్ణ కవులతో నొకవంకను గొప్పరపు సోదర కవులతో నొక వంకను వివాదములు తటస్థించినవి.

1918 సంవత్సరమునఁ బోలవరాధీశ్వరులైన కృష్ణారావుగారు పరమపదించిరి. ఇది తిరుపతి కవిగారికిఁ బెద్ద యాఘాతమైనది. లక్ష్మీవరసాపురం జమీను దారురాలైన శ్రీరావు రాయమ్మగారు అప్పటి నుండి పోషణ బాధ్యత వహించిరి. నాన్నగారు 7-12-1920 వ తేదని స్వర్గతిఁ జెందిరి.

1916 లో వేంకటశాస్త్రిగారు బందరు వదలి కడియమునకు వచ్చి వేసిరి. 1934లో శిష్యులందరునుగలసి బందరులో వేంకటశాస్త్రిగారికి షష్టి పూర్త్యుత్సవము నొనర్చిరి. వారి కళత్ర వియోగానంతరము వేంకటశాస్త్రిగారు విజయవాడలోఁ బుత్రికా గృహమున నివసింపసాగిరి,

1947 లో మనకు స్వరాజ్యము సిద్ధించినది. 1949 లో నుమ్మడి మద్రాసు రాష్ట్రము వారు నాలుగు భాషల కాస్థాన కవులను నియమించి వృద్ధుఁడై మంచమే శరణ్యముగా నున్న వేంకట కవికిఁ బ్రభుత్వము వారే విజయవాడకుఁదరలి వచ్చి యాదాంధ్రాస్థానకవి పట్టాభిషేక మొనర్చిరి.

1950 లో శివరాత్రినాఁడు వేంకటశాస్త్రిగారు శివసాయుజ్య మలంకరించిరి. పింగళి లక్ష్మీకాంతముగా రనినట్లు—

'మరలఁదిరుపతి వేంకటేశ్వరుల జంట
కలిసె ముప్పది యేండ్లపైఁ గాలమునకు'

తిరుపతి వేంకట కవులు వ్రాసిన పుస్తకములలో నెక్కువ వ్యాప్తిలోనికి వచ్చిన వీ దిగువ గ్రంథములు (1) శ్రీనివాస విలాసము (2) శ్రవణానందము (3)పాణిగృహీత (4)దేవీ భాగవతము (5) బుద్ధచరిత్రము (6)లక్షణాపరిణయము (7) భారత నాటకములు. శ్రీనివాస విలాసము గజారోహణము చేయించినది. శ్రవణానందము పాణిగృహీత శృంగార రసప్రధాన గ్రంథములు. వీనిలోఁ బ్రతి పద్యమును రసవ్యంజకమై చదువరుల మనస్సునకు హత్తుకొనును. బుద్ధ చరిత్రము గౌతమబుద్ధుని చరిత్ర. దేవీభాగవత మష్టాదశ పురాణములలో నొకటి. ఇది వారి గురువు గారైన బ్రహ్మయ్య శాస్త్రిగారి కంకితమీయఁ బడినది. లక్షణా పరిణయ మాశువుగాఁ జెప్పఁబడిన ప్రబంధము. ఆశువుగాఁ జెప్పినను శ్రమపడి యాలోచించి వ్రాసినట్లు కవితాధార దీనిలో బ్రసరించును పైపుస్తకము లలో శ్రవణానందమునకు లభించిన యశముద్యోగ విజయములకుఁ దక్క యింకొక దానికి రాలేదు. ఈ శ్రవణానంద మా నాఁడు రసికుల హృదయము నుత్తూత లూగించినది. అటు పిమ్మటఁ దిరుపతి వేంకట కవుల యశస్సును జిరస్థాయి యొనరించినవి భారత నాటకములు. ఈ నాటకములు మొత్తము మీద 1901, మొదలుకొని విరచింపఁబడినవి. అందునను బాండవ విజయము మొట్టమొదటి రచన. ఇంతవరకును రామాయణగాథ నాటకములుగా వెలు వడినవే కాని భారతగాథ నాటకములుగా వ్రాయ బ్రయత్నించిన కవులెవ్వరును లేరు. ఉన్నను బ్రసిద్ధులులేరు అది యాంధ్రుల యదృష్టమనియే చెప్పికొన వచ్చును.నాన్నగారు మొదట దీనిని సంస్కృతములో రచియింప నారంభించినారఁట. తరువాతఁ గలసి కొనినప్పుడు సహాధ్యాయుఁడైన వేంకటశాస్త్రిగారు గట్టిగా మంద లించి యుండవచ్చును. సంస్కృత నాటకము తెనుఁగున బ్రవర్తిల్లినది. నాన్న గారప్పటికిఁ బోలవరాస్థానమున నుండుటచే దీనిని గృష్ణ భూపాల నామాంకితముగా వెలువరించిరి. తరువాత వేంకటశాస్త్రిగారు దీని నుద్యోగ విజయములను రెండు నాటకములుగా విభజించిరి. విజయములో నున్న రెండంకములు — 1. పాండవులు శ్రీకృష్ణుని సంధి యొనరింపఁ బ్రేరేపించుట. 2.శ్రీకృష్ణుఁడు సంధికై ప్రయత్నించి కొనసాగక పోవుటచే యుద్ధమునకు సన్నద్ధులు కండని హెచ్చరించుట — యథా తథముగాఁ గైకొని మొదట నొక యంకము చివర గొన్ని యంకములను జేర్చి పాండవోద్యోగముగా రూపొందించిరి. పాండవోద్యోగ విజయములోని పద్యములు నేటికిని నోటికిరాని పామరులు గూడ లేరనుటలో నతిశయోక్తిలేదు.

వాక్యం రసాత్మకం కావ్యమ్మని యాలంకారికుల మతము. గద్య మయములు గాని, పద్య మయములుగాని, కావ్యముల క్రిందనే జమకువచ్చును. అటి కావ్యములు శ్రవ్య కావ్యములనియు దృశ్యకావ్యములనియు రెండు విధములు. దృశ్య కావ్యములకు రూపకములని పేరున్నది, అవి పది విధములు, వానిలో నాటకము త్తమోత్తమైనది.

కావ్య లక్షణములను దెల్పుచు నాలంకారికుల శీర్నమస్క్రియా వస్తు నిర్దేశోవాపి తన్ముఖమ్మని యాదేశించి యున్నారు. దృశ్యకావ్యములైన నాటకములకీ లక్షణము పూర్తిగా ననువర్తించును దీని ప్రారంభమునందు నాందీప్రస్తావనలు కానవచ్చును. నాందీశ్లోకమాశీర్నమస్క్రియావస్తు నిర్దేశాత్మకమై యుండుటయే కాక చంద్ర నామాంకితమై నిర్దిష్టపదసంకలితమై యుండవలయునను నియమము కూడనున్నది. చాలమంది కవులీ రెండవ నియమమును పాటింపలేదు. నాంది ఐరించిన తరువాత సూత్రధారుడు రంగమున ప్రవేశించి నటి, నటుడు, విదూషకుడు, పారిపార్శ్వకుడు వీరిలో నెవ్వరితోడనైనను సంభాషణము ప్రారంభించును. దీనికి ప్రస్తావ యని పేరు. దీని యందు గవి తన కుల గోత్ర నామాది కథనము, ప్రరోచనమను న్ముఖీకరణము, ఋతువరనము, కావ్యార్థసూచనము, పాత్రప్రవేశ సూచనము నను నైదంగము లుండును.

నాందీపద్యములో వస్తు నిర్దేశము చేయబడినది. ఇది తిరుపతి వేంకట కవులను గూర్చిన నాటకమని విస్పష్టమగుచున్నది. నాందియైన తరువాత సూత్రధారుడు నటితో సంభాషించును. గురుశిష్య కలహములను శాఖాభేదప్రయుక్తములైన కవుల కలహములను సూచింపఁబడినవి. 'కౌండిన్యసగోత్రజుఁడను' అను పద్యముతో నింకొక పద్యమును జేర్చిసభాసదుల నున్ముఖీకరణ మొనర్చికొనినారు. ఋతువర్ణనమునకు బదులు గౌరణములను దెల్పి యాంధ్రుల యిష్టదైవమగు వేంకటాచలపతి నిలయమైన తిరుపతిని గూర్చి వర్ణింపఁబడినది. 'కనఁబడు వింత పద్ధతు'లను పద్యమును దన కన్వయించుకొని 'ఎవఁడాతం'డని యెలుగెత్తి యరచుచుఁ దిరుపతిశాస్త్రి భూమికను ధరించిన నటుడు ప్రవేశించును. నటీ సూత్రధారులు నిష్క్రమింతురు. దీనితో ప్రస్తావన పూర్తియైనది.

ఈ నాటకమున జాలభాగము విష్కంభములు వాడఁబడినవి. విష్కంభములు రెండు రకములు. శుద్ధవిష్కంభము. మిశ్ర విష్కంభమనునవి. ఉత్తమ పాత్రలతో నడిపినది శుద్ధవిష్కంభము. మిశ్రపాత్రలతో నడిపినది మిశ్రవిష్కంభము. గతించిన దీర్ఘకాలమునందలి కథను సంక్షిప్తముగా నెఱిఁగించుటగాని జరుగఁబోవు కథకు భూమిక నేర్పాటు చేయుటగాని విష్కంభముల వలని ప్రయోజనము.

తిరుపతి వేంకటీయమను నాటక శీర్షిక కర్థము చెప్పికొన వలసి వచ్చినచో, తిరుపతి వేంకట కవులకు సంబంధించిన నాటకమని కాక తిరుపతి సహాధ్యాయి గాఁగల వేంకటకవిని గూర్చిన నాటకమని యర్థము చెప్పికొన వచ్చును. ఎవ్వరో మీ రొక్కరే వ్రాసిన పుస్తకమున కిర్వురి పేరునుబెట్టితిరేలయని యాక్షేపించి నప్పు డిర్వురముచు వ్రాసిన పుస్తకముల కిర్వుర నన్వయించు కొని యొక్కఁడనే వ్రాసిన దానికిఁ దిరుపతి సహాధ్యాయుఁడైన వేంకటకవి వ్రాసిన పుస్తకమని యర్థము చెప్పికొన వచ్చునని వేంకట శాస్త్రిగారు సమాధానము చెప్పిన గుర్తు. నాటకమున కెవ్వరో యొక్కరే నాయకుఁ డుండవలయునుగాని యిర్వురుండుట పొసంగునది కాదుగద ! అందువలన నీ నాటకమున వేంకట శాస్త్రిగారు నాయకు లనక తప్పదు. అదియునుంగాక ఈ నాటకములో స్త్రీ పాత్రలులేవు. లేనందున నాటకమునకు వచ్చిన హానియును లేదు. ఇట్టి నాటకమనఁగా స్త్రీ పాత్రలులేని నాటకము సంస్కృత సాహిత్యమున ముద్రారాక్షస మొక్కటి కొన వచ్చుచున్నది.

ప్రథమాంకమున వేంకట శాస్త్రిగారు వ్యాకరణాభ్యాసమునకై బ్రహ్మయ్య శాస్త్రిగారి యొద్దఁ జేరుట వర్ణింపఁబడినది. తిరుపతి నోటివెంట "గురుదేవు లితనితో నాకేదియో బ్రహ్మముడి వేయుచున్నార"నియు బ్రహ్మయ్య శాస్త్రిగారి చేత "నీ పేరులోఁ గొంత సంగ్రహింతున"నియు మరలఁ దిరుపతిచే గురువుగారి వాక్యములో "నా కేదియో యర్థాంతరము స్ఫురించుచున్నద"నియుఁ జెప్పించుట చాల హృదయంగమముగా నున్నది. సహాధ్యాయు లిరువురును దిరుపతి వేంకటే శ్వరులు కానున్నట్లు కవిగారు చక్కఁగా సూచించినారు

ద్వితీయాంకమునఁ దిరుపతి వేంకటకవులు వేంకటగిరి రాజులను దర్శించుట కొనరించిన ప్రయత్నము విఫలమైనట్లు వర్ణింపఁ బడినది. మొదట జరిగిన దంతియే. తిరుపతి వేంకట కవుల కారంభము నుండియుఁ దమలోఁ దమకే వాగ్వివాదములు తటస్థించు చుండెడివని తెల్పుట కొక కొంత గాథ కల్పింపఁ బడినది.

మూఁడవ యంకమున గద్వాల సంస్థానమున వైష్ణవ పండితులు తిరుపతి వేంకట కవులకు బ్రవేశము కలుగకుండ జేయుటకై చేసిన ప్రయత్నములు, కవులు విజయము నందుట వర్ణింప బడినవి. సంస్థాన మండలి వైష్ణవ పండితులెట్లు పరాభ వింపఁ బడినదియు మిగులఁ జక్కఁగాఁ జూపఁ బడినది,

చతుర్థాంకము కొప్పరపు సోదర కవులకై ప్రత్యేకింపఁబడినది. సోదర కవుల యాశు కవితావ్యాసంగము చాల నేర్పుతో నీ యంకమునఁ బ్రదర్శింపఁ బడినది.

పంచమాంక మాత్మకూరు సంస్థానమునకు సంబంధించినది. తిరుపతి వేంకట కవులు తమ కవితా ప్రదర్శనముచే సీతారామ భూపాలకుని మెప్పించి శ్రీనివాస విలాస మాంధ్రీకరించుటకై కర్పూర తాంబూలమును గ్రహించిరి. ఈ యంకము చదువుచున్నంత సేపును నా యొడలు పుల్కరించినది. రాజ సభ యందు దానాడు సరిగ నీ రీతిగనే యుత్తర ప్రత్యుత్తరములు జరిగియుండ వచ్చు నను భ్రమ పాఠకునకు గల్పించిన తీరు విమర్శించినచో మనోనేత్రమున గతమును సందర్శించు సుకవి కసాధ్యమైన కృత్య మేదియు నుండదని యని పింపక మానదు.

షష్ఠాంకమున దివాకరాస్తమయము వర్ణితము. విష్కంభములో రామకృష్ణ కవులొనర్చిన గురువులతో గ్రుద్దులాటయు వారి యాంధ్రకవుల యపరాధములును వర్ణింపఁబడినవి. శిష్యుఁడు లక్ష్మీకాంతము పాండవ విజయమును జేతఁ బట్టుకొని వచ్చి గురువుగారు చదువు మని నంతనే 'పాండవు లందు నాకుఁగడుపక్ష' మను పద్యము జదువును. గ్రంధకర్త స్వయముగాఁ గష్టములందున్నట్లు వెలువడిన ధ్వని ననుమానించి గురువుగారు చదువుట మానివేయు మందురు. తరువాత 'కులము చెఱుపఁగ నూర్వురు కొడుకులేల' యను పద్యము జదివి యందు నీ చోపమ నెందుకు వాడిరని తర్కించును. వేంకటశాస్త్రిగారి నోట "తిరుపతి యిట్లు వ్రాసి చచ్చినాడేమి" యనిపించి సత్వర భావ్యర్థమును సూచించుట సమంజసముగా నున్నది. నాకీ సందర్భమున గిరతములోని 'దిక్కుల నిండ నాత్మ గురు తేజము నింపి' యను పద్యము జ్ఞాపకము వచ్చుచున్నది.నా సహాధ్యాయి స్వర్గతిని సూచించి వాని మృత్యువునకు నేనే కారకుఁడనైతినని గురుదేవు లనుట చాల సారులు వినియుంటిని.

సప్తమాంకమున వేంకటశాస్త్రిగారికి జరిగిన షష్టి పూర్త్యుత్సవము వర్ణింపఁబడినది. అందు సన్మానిక పాత్రగాఁ బ్రవేశపెట్టి 'వేంకటేశ్వరరూపమ్మున మన్న తండ్రికి నమస్కారంబు లర్పింపఁజేయుట' మిక్కిలి యుచితముగా నున్నది.

అష్టమాంకమున విజయవాడలోన స్వస్థుఁడుగా నుండి మంచమే శరణ్యముగా నున్న వృద్ధకవి సింహమునకుఁ బ్రభుత్వమే మద్రాసు నుండి తరలివచ్చి యాంధ్రాస్థానకవిగా నభిషేకించుట వర్ణింపఁబడినది.

ఈ నాటకమునందుఁగొన్ని చారిత్రిక కాల వ్యత్యాసములు కానవచ్చుచున్నవి. అవి మిక్కిలి సూక్ష్మ దృష్టితోఁ బరిశీలించినగాని గోచరింపవు. నాటక కవి సన్నివేశములన్నియు గుదిగ్రుచ్చుకొని పాఠక ప్రేక్షకుల కానందము గలిగించుటయే

లక్ష్యముగాఁ బెట్టుకొని రచన సాగించుటకుఁ బ్రయత్నించును. వాని కట్టి స్వాతంత్ర్యము కలదు. సంస్కృత కవులే కాదు, తెనుఁగు కవులు కూడ నిట్టి స్వాతంత్ర్యమును జాల మంది కైకొని యున్నారు.

తిరుపతి వేంకట కవుల జీవితములో జరిగిన యత్యంత ప్రధాన ఘట్టములు రెండు ఇదలి వేయఁబడినవి. మొదటిది విజయనగర ప్రభువగు నానంద గజపతిని సందర్శించుట. రెండవది పోలవర భూపాలునకు బుద్ధ చరిత్రము గృతి యొసంగిన తరువాతఁ గవులు చెరియొక చోటను స్థిరపడుట. ఈ రెండు సన్నివేశములను రెండంకములలోఁ బ్రదర్శించి నాటకమును బ్రకరణ మొనర్చిన బాగుండునను కొంటిని.

మొత్తము మీఁద నాటకము బుధజన ప్రీతిపాత్రమై యలరారు ననుటకు సందేహము లేదు. తిరుపతి వేంకటీయమున దిరుపతి వేంకటేశ్వరుల పద్యములనే యుపయోగించుట మెచ్చుకొనఁదగిన విషయము. నాటకము జదువుట మొదలు పెట్టినది మొదలు ముగించు వఱకును విడువ బుద్ధిపుట్ట లేదనుటలో నతిశయోక్తి లేదు. నాకే కాదందరకు నిట్లే యుండుననినా నమ్మకము. సంభాషణలలో సరిగ నతికినట్లు రసవత్తరములగు పద్యముల నిరికించుటలోఁ గవికిగల్గిన కౌశలమభినందనీయము. నాటకాంతేచసాహిత్యమ్మని పెద్దల నానుడి. ఈనాటకము కవిగారి కఖండమైన యశము గడించిపెట్టి యింకను బెక్కు స్వతంత్ర నాటకములకుఁ దోడ్పడునని నా యాశయము

నానారూపములన్ ధరించి జగతీనాట్యస్థలిన్ నాటక
శ్రీ నిర్వాహక సూత్రధారుఁడగుచున్ శ్రేయమ్ములందించు ల
క్ష్మీ నారాయణుఁడాత్మనామధరు రక్షించున్ గృపాసాంద్రుఁడ
న్యూన ప్రాభవసంప దుత్సవచిరాయుర్దాయముల్ గూర్చుచున్.

నవుడూరు
30—4—75

బుధజనవిధేయుఁడు
దివాకర్ల వేంకటావధాని

# తిరుపతి వేంకటీయము

## ప్రథమాంకము

(నాంది)

తిరుపతి చేత వచ్చెనో యతిప్రతిభా మహిమంబు వేంకటే
శ్వరునకు, వేంకటేశ్వరుని వల్లనె చెందెనో యామహత్త్వముల్
తిరుపతి, తద్విశేష లవలేశమునైన నెఱుంగలేక కొ
ప్పరములు కుప్పగూరగ బరివాదము నొందిరి రామకృష్ణులున్

(నాంద్యంతమున సూత్రధారుడు ప్రవేశించును)

సూత్ర : (తెరవంకజూచి) - ఆర్యురాలా ! అశుధారలేని యవధానితో విసిగివేసారిన పృచ్ఛకులవలె మన నాటకాలస్యమునకు సభాసదులు నిరాశను సూచించుచున్నను ఇంకను గాలహరణము తగునా ?

(నటి ప్రవేశించును)

నటి : ఆర్యపుత్త్రా ! నిన్నటినుండి మన నటులలో నిరువురు "మాశాఖ గొప్పది మాశాఖ గొప్పది" యని వారి వారి పూర్వులను ప్రశంసించుకొనుచు

నెదుటివారి పూర్వులను అకారణముగా నిందించుచున్నారు. వారిని శాంతింపఁజేయుటలో నింత కాలహరణ మైనది. క్షమింపుఁడు.

సూత్ర : ఓహో! అదియా సంగతి. వారెవరో నేను గ్రహించితిని. వారిరువురును ఒకరిపై నొకరికి గౌరవము కలవారే. కాని యీమధ్య కొందఱు శాఖోప జీవులైన స్వార్థపరులు వీరిలో ఆ ౹షబీజము నాటినారు. మరల ఆ దుష్ప్రా రంభము లేకుండఁగ మూలచ్ఛేదము చేసితివిగద. చాల సంతోషము,

నటి : ఏమి సంతోషమో! వీరి గ్రుద్దులాటల కొలువులో ఒక రహస్యము బయల్పడినది. "నబ్రూయాత్ సత్యమప్రియమ్" అనికదా! కావున నేను మీతో ఆ విషయము చెప్పఁగూడదు.

సూత్ర : ఆ విషయము అప్రియమైన సత్యమనియు, నాకు సంబంధించినదనియు నీ మాటలవల్లనే తెలియుచున్నది. భయపడక చెప్పుము, "దోషావాచ్యా గురోరపి" అన్నది నీ వెఱుఁగనిది కాదుగదా!

నటి : (తనలో) వీరి వాక్కులు గూడ ఆ విషయము ననుసరించియే యున్నవి. ఏది ఏమైనను జెప్పక తప్పదు. పైగా ఆడుదానను, నోట మాట దాగదు. (ప్రకాశముగా) - ఆర్యపుత్రా! మీకు మీ గురువుతోడను, మీ శిష్యుని తోడను వివాదము వచ్చినదఁట. నిజమేయగునా?

సూత్ర : సత్యమును గాదనుట యెట్లు? నాకు మేఘసందేశములోఁ బ్రథమ సర్గ కూడ సంపూర్ణముగా బోధింపని ఒక మహాత్ముని గురువుగా నేనంగీకరించి నను అతఁడు నన్ను శిష్యునిగా గణింపక పోవుటయేకాక వాత్సల్యమునకు బదులు మాత్సర్యమును బ్రదర్శించినాఁడు. కాని ఏకాక్షర ప్రదాతగూడ గురువే యను న్యాయముచేత నేనిప్పటికిని గురుపరంపరలో స్మరించు చుందును. గురువు లెందఱున్నను జ్ఞానబోధ కల్గిన చోటుగదా స్మరణీయము.

ఓనామాలను జెప్పు నొక్క గురుఁ డింకొక్కండు దానక్షర
జ్ఞానం బించుక వృద్ధిపేయుఁ బయిశాస్త్రంబింక నొక్కండు రాఁ
గానేర్పున్, గురుమాత్రులెల్లరు నమస్కారార్హులేయైన, వి
జ్ఞానంబిచ్చినచోటు ప్రప్రథమ వక్తవ్యంబు శ్రేయోర్థికిన్.

ఇది యిటులుండ నాకడ విద్యను గొంత అభ్యసించిన శిష్యుఁడొకఁడు నన్ను గౌరవింపక పోవుటయేకాక దూషించుట కూడ జరిగినది. ఆ విషయము సవిస్తరముగాఁ బ్రస్తావించుట కిది సమయముకాదు. తీఁగె కదిపిన డొంకంతయుఁ గదలును. ఇప్పటికే అప్రస్తుత చర్చతోఁ బ్రస్తుతాంశము విస్మృతమైనది. ఈ కాలవిలంబనము ఊర్జితకీర్తి నార్జించుకొన్న మన పరదేవతా నాట్యమండలికి నపయశము తేరాదు ఎమీ!

నటి : ఆర్యపుత్త్రా! అటులే. కాని మృత్పిండము వజ్రపుఁదునకతో ఢీకొన్నటుల మీ శక్తిసామర్థ్యములు తెలిసి తెలిసి వారేల కయ్యమునకు దిగిరి?

ఒక రాజా! ఒక పండిత ప్రవరుఁడా! యోజింప నీ మధ్య భూ
మికి లోనున్న యశేషమానవులునున్ బెంపార నెవ్వాని మై
త్రికొ శైష్యమ్ముకొ, కోరుచుండెదరె, యుక్తింగానలే రీరలే
టికి, మీతోడ వృథా వివాదములతో డీకొట్టఁగాఁ బూనెడిన్.

అదియునుంగాక (సూత్రధారుఁడు నిర్లక్ష్యముగా నుండగా భయపడి) క్షమింపుఁడు. నేను నాటకోపక్రమణమునకు సిద్ధముగా నున్నాను. ఏ యంశముచేత నేఁటి సభాసదులను రంజింపఁ జేయుదము?

సూత్ర : నేఁటి సభాసదులు వెనుకటివారివలెఁ బురాణేతివృత్తములతోఁ దృప్తి చెందెడివారు కారు. వీరి భావములకు ఆంధ్రదేశాభిమానము తాళికట్టినది. ఈ విద్వజ్జనములను రంజింపఁ జేయుటయే మన లక్ష్యము గదా! కనుక మన మిప్పుడు వీరి యభిప్రాయమునకు అనురూపమైన ఆంధ్రదేశీయ ఇతివృత్తమును గ్రహింపవలెను.

నటి : నిత్యము కళారాధనముతో నానారాజసందర్శనముచేయు మనకు ఆంధ్రదేశపు పరిస్థితులెన్నియో తెలియును. కాని వానిలో నేయంశము రసికానందమగును?

సూత్ర : ఈ యాంధ్రదేశములో ధరణీనాథుల సభాంతరములలో అసూర్యంపశ్యగా నున్న తెలుఁగుకన్యను బల్లకీమీఁద వీథి వీథినిద్రిప్పి యుగకర్తలనిపించుకొన్న మహాకవుల చరిత్రమే మనకు సరియైన ఇతివృత్తము.

వ్యాకరణము తెలిసినఁ గవి
తాకల్పన లేదు సుకవితావిదులైనన్
వ్యాకరణము రాదీ రెం
డీకాలమునందు లొంగె నెవరికి – వారే.

నటి : అట్టి వారెవరు ?

సూత్ర : చెప్పుచుండఁగనే త్వరపడెదవేల ? తరతరాలనుండి దాఁచిగోదావరి కానుకో పెట్టిన తేనెవాకలు. ప్రాచీనకవిత్వమునకు భరతవాక్యము నవీనకవిత్వమునకు నాందీ వాక్యమును బలికిన అద్యతనాంధ్ర కవిప్రపంచ నిర్మాతలు. కవలవలెఁ జరించు జగత్ప్రసిద్ధ శతావధానులు.

నటి : ఎవరు ? తిరుపతి వేంకటేశ్వరకవులా ?

సూత్ర : ఓసీ! పాణిగృహీతీ! ఏమి నీ తెలివి? తిరుపతి వేంకటేశ్వరకవులాయని ప్రశ్నింతువేమి? ఇంత ప్రసిద్ధివడసిన కవులు వీరుగాక యీ శతాబ్దములో నింకెవరు ? కనుక తిరుపతి వేంకటీయమే నేఁడు మనకు నాటకోచిత వస్తువు.

నటి : వస్తువు బాగుగనేయున్నది. ఈ వస్తువును స్వీకరించి నాటకముగా వ్రాసిన దెవరు ?

సూత్ర : ఈయన పేరు నాకు గుర్తులేదు.

(ఒక కాగితమును బయటికిఁ దీసి)

ఇతఁడు తన్నుఁగూర్చి చెప్పుకొన్నది చదివెదను. వినుము.

"కౌండిన్య సగోత్రజుఁడను
గుండవరపు వంశజుఁడను గుంటూరు నివా
సుండ సరస కవనమనన్
బండువ యనువాఁడ లక్ష్మినారాయణుఁడన్"

నటి : ఈయన ఎవరో క్రొత్త

సూత్ర : రచనలోఁ గూడఁ గ్రొత్తఁదనమున్నదనుచున్నాఁడు వినుము.

"ఇరువదవ శతాబ్దమ్మునఁ
జరించినట్టి సుకవీంద్ర చరితమ్మిటు లె
వ్వరు నాటకమ్ముగ రచిం
పరు నేఁ బూనితిని క్రొత్త పద్ధతి యనుచున్"

నటి : ఓహో ! అటులా ?

సూత్ర : ఆలస్యమగుచున్నది. నీ గానమాధుర్యముచే రసిక జనులకు శ్రవణా నందమును గల్గింపుము.

నటి : ఏ ఋతువు నాశ్రయించి పాడుమందురు ?

సూత్ర : ఋతువుల నాశ్రయించి పాడుట మనకు ప్రాతపద్ధతియే కదా. ఇచటి సదస్యులు ప్రాతరీతులపై రోతకల్గినవారనియు, ఆంధ్రదేశాభిమాను లనియు మొదటే చెప్పితిని కదా ! కనుక ఆంధ్రుల యిష్టదైవమగు వేంకటాచలపతికి నిలయమైన తిరుపతిని వర్ణింపుము.

నటి : ఆర్యపుత్ర ! ఈదిన మేలకో నాకు సందియము లెక్కువ కల్గుచున్నవి. క్షేత్రస్వామిని విడచి క్షేత్రమును వర్ణింపుమందురేల ?

సూత్ర : నీకిన్ని సందియములు కలుట కూడ నొక క్రొత్త పద్ధతియే.

(నటి సిగ్గుతోఁ దల వంచుకొనును)

క్షేత్రమును వర్ణింపుమనుటలో నొక ధర్మసూక్ష్మమున్నది. మనము రంగస్థలముపై నటించి జీవించువారలము. కనుక మనకు రంగస్థలము పూజ్యము. అందుచేతనే ఆ జగన్నాటక సూత్రధారుని రంగస్థలమును వర్ణింపుమంటిని.

నటి : చిత్తము మీ యూహ ఎట్లు సభాజనులను ప్రభావితము చేయునో పాడి పరిశీలించెదను.

కనఁబడు వింతపద్ధతులు కన్పడు సార రసప్రవాహముల్
కనఁబడు సాధువృత్తములు కన్పడు బ్రహ్మగురూత్సవంబులున్
గనఁబడు వాంఛితార్థములు కన్గొనఁ దిర్పతియందు వేంకటే
శుని స్తవనీయ పాదములు సోకుటచేత మనోహరంబుగన్.

(తెరలో).

ఓరీ : భరతపుత్త్రి: ఎవఁడురా నా కవిత్వమునకు మెఱుఁగులు దిద్దినవాఁడు

ఎవఁడాతం డతఁ డెందునుండు నతఁ డేయేవిద్దెన్ మేటి ? పే
రెవ రూ రెయ్యది ? నాకవిత్వమున కేమేమో విశేషంబు ల
క్కవి చేకూర్చుటవల్ల కల్గెనఁట ఏ గ్రంథమ్ములోఁ జేసెరా ?
ఎవఁ డెవ్వం డతఁ డెవ్వఁ డెవ్వఁ డలవాఁ డెవ్వాఁ డెవం డెవ్వఁడో !

సూత్ర : (వినుట నటించి) తిరుపతి వేంకటేశ్వర కవులలో నొకఁడైన దివాకర్ల తిరుపతి శాస్త్రి యిప్పుడు నీవు చదివిన పద్యమును దన కన్వయించుకొని ఆగ్రహోదగ్రుఁడై వచ్చుచున్నాఁడు. సంశయ సముద్రాంతర్గతముచేయు సాధనములలోఁ బాండిత్యము ప్రధానమైనదికదా! ఆ మహాకవిసమక్షములో మనము నిలువలేము లోనికేఁగుదము.

(నిష్క్రమింతురు).

– ప్ర స్తా వ న –

(ప్రదేశము - కడియెద్ద. చర్ల బ్రహ్మయ శాస్త్రిగారి ఆశ్రమము - తిరుపతి శాస్త్రి యను విద్యార్థి గ్రంథమును జేతఁబట్టుకొని ప్రవేశించును)

తిరు : నేను గురువుగారి యొద్ద వ్యాకరణము నేర్చుకొనుచున్నను. ఏదో అనవద్య శక్తి నన్ను పద్య విద్య కుద్యమింపఁ జేయుచున్నది, ఆశయము మంచిదే కాని దానికిఁ దగిన సామర్థ్యము కావలెనుగదా ? ఆ సామర్థ్యము పూర్వజన్మ సంస్కారము వలనగాని లభింపదు. ఆ ప్రతిభ నాలో ఉన్నదా ? (కొంచెము ఆలోచించి) ఏమో ! ఏ పుట్టలో ఏ పామున్నదో ! ఎవఁడెఱుఁగును ? (నిస్పృహతో) కవిత్వమనిన మాటలా ? దాని శక్తి సామాన్యమా ?

పాపిష్ఠ రాజుల పాలి దయ్యమ్ము, సం
ధ్యావందనమునకు బావగారు
పరదేశ సంచార కరణమ్మునకు రైలు
జపతపమ్ములకెల్ల సవతి తల్లి
ముక్తి కాంతా సంగమునకుఁ దారపుఁగత్తె
సద్యశోవ్యాప్తికిఁ జాటు డప్పు
ఆనందమునకు దివ్యాంగనా సంగంబు
రాజసంబునకు గారాల కూచి

భాగ్యభోగ్యమ్ములకు నెల్లఁబట్టుఁగొమ్మ
యఖిల వేత్తృత్వమునకు దివ్యాంజనంబు
సరస జనులకుఁ గ్నరసాయనంబు
కవిత యిట్టిది యని చెప్పఁగాఁదరంబె ?

కానిమ్ము. దైవేచ్ఛ ఎట్లున్నదో -

చతురాస్యుండు కలాకరుండు జగదాశ్చర్య ప్రభావుండు సం
స్కృత భాషోదయుఁ డుత్తమాభినుత కీర్తి ప్రాభవోపేతుఁ డ
ర్పిత భక్త్యుచ్ఛ్రయుఁ దార్ద్రచిత్తుఁడు గురుశ్రీకుండునౌ బ్రహ్మపం
డితుఁడెల్లప్పుడు నా సరస్వతికి జోడించున్ శుభారంభముల్.

(మరల మెల్లఁగా నిట్లు చదువును.)

బ్రహ్మ పండితుఁ డెల్లప్పుడు నా సరస్వతికి జోడించున్ శుభారంభముల్

(ఇంతలో నొక బాలుఁడు కంటికి గుడ్డ కట్టుకొని యీతనివైపు వచ్చు చుండును)

తిరు : (తనలో) – ఎవఁ డీతఁడు మా యాశ్రమము వైపునకే వచ్చుచున్నాఁడు ?

ఒకకంటఁ జూచుచును వే
ఱొక కంటికి గుడ్డ కట్టి యొంటరిగా మి
న్నక రాఁదొడంగెఁ గనువా
రకిఁ దాఁగపి యగుటఁదెల్పురీతి నతఁడొగిన్.

(బాలుఁడు దగ్గఱకు వచ్చును.)

బాలుఁడు : ఓయీ ! విద్యార్థీ ! పూజ్యులగు చర్ల బ్రహ్మయశాస్త్రిగారి యాశ్రమ మిదియే కదా ! వారింటనుండిరా ?

తిరు : అవును. వారు లోపల పూజ యందున్నారు బయటికి వచ్చువేళయైనది. నీ పేరేమి ?

బాలుఁడు : వేంకటాచలమందురు ఆరామ ద్రావిడ శాఖీయుఁడను. చెల్లపిళ్ల కామయశాస్త్రిగారి ఏకైక పుత్త్రుఁడను. మా గ్రామము కడియము నీ వెప్పటినుండి యిచ్చట చదువుచున్నావు ? నీ పేరేమి ?

తిరు. తిరుపతిశాస్త్రి నా పేరు. దివాకర్ల వేఁకటావధానిగారి పుత్త్రుఁడను. వెల నాటి వాఁడను. కవితకు వెలనాటిన వాఁడను. ఇచ్చటఁజేరి ఐదు మాసము లైనది.

వేంకట : (తనలో) ఇంతకుము దుత్రోవచూపించిన ఒకవిద్యార్థి చెప్పినట్లు ఇత నికి గర్వము మెండు. కాని గర్వమునకుఁ దగిన ప్రతిభ యితనిలోఁగొట్ట వచ్చినట్లు కన్పడుచున్నది బ్రహ్మశ్రీ బ్రహ్మయశాస్త్రిగారి యుపదేశ బలమె దీనికి మూలమై యుండవచ్చును. ఆ మహాత్ముని యనుగ్రహముచే నేనీ తిరుపతి శాస్త్రి కంటె గొప్పవాఁడను గాఁగూడదా ?

(ప్రకాశముగా) మీ స్వగ్రామమేది ?

తిరు : ఎండగండి. ఇంతకు నీ వెందులకు వచ్చితివి ?

వేంకట : (తనలో) కొంచెము నా పద్యరచనాశక్తిని గూడ నీతనికి రుచి జూపించినఁగాని నా మనస్సు ఊరట చెందదు.

[ ప్రకాశముగా ]

కాశీపండితుఁడై కృపాళుఁడయి ప్రఖ్యాతి ప్రభాపూర్ణుఁడై
యాశీర్వాదము మాత్ర శిష్యులను విద్యావంతులన్‌జేయు మేల్
వైశద్యంబునఁబొల్చు చర్లకులజున్ బ్రహ్మయ్యశాస్త్రిన్ గళా
రాశిన్ జేరితిఁ గొల్వఁబూనఁగ సతీర్థ్యా! భక్తిభావంబుతో.

తిరు : (తనలో) ఈతఁడప్పుడే సంబంధమును గలుపుచున్నాఁడే.

[ తెరలో ]

ప్రాతఃకృత్యములన్ యథోచితముగాఁ బాటించి పొత్తమ్ములన్
జేతంబూని నవీనపాఠమును నిశ్శేషమ్ముగాఁ జూచి తా
మా తాత్పర్యము గొంతకొంత మదిలో నానించి విద్యార్థులెం
తో తాత్పర్యముతోడ దేశికుఁ గన్గొబోవుచున్నారొగిన్.

తిరు : (పరికించి తనలో) ఓహో! అధ్యయనమునకు గురుదేవుల పాదసన్నిధికిఁ జేరువేళయైనది. నేను నా కవితా వ్యాసంగములో నిమగ్నుడై కాలమునే గమనింపనైతిని.

(మరలఁ బరికించి) (తనలో) గురుదేవులు విద్యార్థులను వెంటబెట్టుకొని ఈ వైపునకే వచ్చుచున్నారు. (గుర్తువచ్చినట్లు నటించి) అన్నట్లు గురువుగారు కాశీ వెళ్లివచ్చి నప్పటినుండి గణపతికిఁ బ్రాముఖ్య మిచ్చుచున్నారు. మొన్న గురువుగారు "గణపతి నవరాత్రములు సమీపించుచున్నవి. మన అధ్యయనము గణపతి విగ్రహము ముందే కొనసాగింతము" అని చెప్పినారు. కనుక నేడధ్యయనము ఈ చెట్టుక్రిందనున్న గణపతి విగ్రహమునకు ఎదుటే.

(బ్రహ్మయ్యశాస్త్రి నలుగురు శిష్యులతో వేదము పఠించుచు సమీపించుచుందురు.)

వేంకట : (తనలో) ఆహా ! ఏమి యీ బ్రహ్మయ్యశాస్త్రిగారి బ్రహ్మవర్చస్సు ! (ప్రకాశముగా) ఈ కలిలోఁగూడ ఈ యాశ్రమము ప్రాచీన గురుశిష్య సంప్రదాయములను గుర్తుచేయుచున్నది.

ఆహా ! ఏమియా వేదఘోష ! అర్థము తెలియకపోయినను శబ్ద శ్రవణ మాత్రము చేతనే నాచేతము పరవశము చెందుచున్నది.

చెప్పులకాళ్ళు ముండితపు శీర్షము శూన్యలలాటమున్ మఱిన్
గొప్పబడాయి వేషములుఁ గుచ్చుల పొగలుఁ గోట్లు కంఠమం
దొప్పెడి పట్టముల్ గలుగు నొజ్జలు శిష్యులు నీకులేరు, మా
యప్ప ! చిరాయువై బ్రతుకుమమ్మరో ! వేదమ ! నీకు మ్రొక్కెదన్.

"బెంచీ" లక్కఱలేదు, "గేమ్సు" మొదలౌ "ఫీజుల్" వినన్ రావు పో
మ్మంచున్ నిర్ధనుఁద్రోచిపుచ్చరు గురుల్ "ప్యా"సైననే లాభ మిం
దంచున్ నేమములేదు. మీ చదువునం దాలోక మీ లోకమున్
గాంచన్ వచ్చెడి ఆర్యులార ! మిము మ్రొక్కన్ జెల్లు నెక్కాలమున్.

(బ్రహ్మయ్యశాస్త్రి శిష్యులతో వీరికడకు వచ్చును – తిరుపతిశాస్త్రి లేచి నమస్కరించును)

వేంకట : (రెండు చేతులతో రెండు చెవులు పట్టుకొని)

చతుస్సాగర పర్యన్తం గోబ్రాహ్మణేభ్యః శుభంభవతు. ఆంగీరస బార్హస్పత్య భారద్వాజ త్ర్యార్షేయ ప్రవరాన్విత భారద్వాజ సగోత్రః ఆప స్తంబసూత్రః యజుశ్శాఖాధ్యాయీ వేంకటాచలశాస్త్ర్యహంభో అభి వాదయే.

బ్రహ్మ : సర్వ సన్మంగళాని భవంతు.

నీకుం గీర్తి హెచ్చుఁగాక మఱియున్ నీకాయురారోగ్య సు
శ్రీకళ్యాణ పరంపరల్ పరఁగుతన్ శృంగారభంగుల్ సదా
నీకున్ భోగ్యములై చెలంగుత మఱిన్ నీనామమే యీ ప్రజా
నీకమ్మందొక మంత్రమై వెలయుతన్ దేవీప్రభావంబునన్.

వేంకట : ధన్యోస్మి. ధన్యోస్మి.

బ్రహ్మ : చిరంజీవీ ! నాకడ విద్యాధనము తప్ప మఱియొకటిలేదు. నీవుకూడ విద్యా సముపార్జనము కొఱకే నాకడకు వచ్చి యుందువుకదా ! నాకు సాహిత్యముకన్న వ్యాకరణముపై గౌరవము మెండు. వ్యాకరణము చదివిన సర్వ శాస్త్రములు చదివినట్లే. దీని వలన అన్ని సందేహములు తీఱిపోవును. "అసందేహార్థం చాధ్యేయం వ్యాకరణమ్" అని కదా భగవాన్ పతంజలి ఆదేశము. మఱి నీవా వ్యాకరణము నభ్యసింతువా ?

వేంకట : మీ మాటలు ఆర్షసూక్తములవలె శిరోధార్యములు. మీ అనుగ్రహముతో మునిత్రయము నారాధించి నా జన్మమును సార్థకము చేసికొందును.

బ్రహ్మ : అవిఘ్నమస్తు

(తిరుపతిశాస్త్రి వంకఁ జేయిచూపించి)

ఈ కిఱ్ఱువాఁడు నా కడ వ్యాకరణము ప్రారంభించి సిద్ధాంత కౌముదిలో శబ్దాధికారము పూర్తిచేసినాఁడు. ఇతనితో నిన్ను కలిపి ఇద్దఱకును వ్యాకరణమును బూర్తిచేసెదను.

వేంకట : గుర్వాజ్ఞ.

తిరుపతి : (తనలో) గురుదేవులు ఈతనితో నాకేదియో బ్రహ్మముడి వేయుచున్నారు. కానిమ్ము. బ్రహ్మచేతకు నెవరు ప్రతిసేయఁగలవారు ? వీరిభావము లెప్పుడును శతావధాన కృతులే.

బ్రహ్మ : నీ పేరు వేంకటాచలశాస్త్రి యనికదా చెప్పితివి. నీ పేరులోఁ గొంత సంగ్రహింతును. నిన్ను వేంకటశాస్త్రి యని పిలిచెదను.

తిరు : (తనలో) "నీ పేరులోఁ గొంత సంగ్రహింతును" అను గురువుగారి వాక్యములో నాకేదియో అర్థాంతరము స్ఫురించుచున్నది.

వేంకట : నేను మీవాఁడను. నాపై మీకు సర్వాధికారములు గలవు.

(బ్రహ్మయ్యశాస్త్రి శిష్యుల వంకఁదిరిగి)

బ్రహ్మ : పాఠమును ఆరంభించుదము.

(అందఱు కలసి పాడుదురు)

సహనావవతు సహనౌ భునక్తు
సహవీర్యం కరవావహై
తేజస్వినావధీతమస్తు
మా విద్విషావహై ఓం శాన్తి శ్శాన్తి శ్శాన్తిః

– ఇది ప్రథమాంకము –

# తిరుపతి వేంకటీయము

## ద్వితీయాంకము

(ప్రదేశము - చర్ల బ్రహ్మయ్యగారి గృహము)

(ఒక శిష్యుఁడు కూరగాయలను కడుఁగుచు మధ్య మధ్యలో గ్రంథము చూచుచుండును)

ప్రథముఁడు : ఈ యాశ్రమములో నేను బ్రహ్మయశాస్త్రిగారి పాదసేవ చేయుట ప్రారంభించి యిప్పటికి ఆఱు సంవత్సరములు కావచ్చినది. ఈ షడ్వర్షములలో నాకబ్బినది షడ్రుచులపై అభిరుచి మాత్రమే. అందులకే నాకు వంటయింటి పెత్తన మప్పగించినారు. దిన దినమునకు నాకు జీర్ణశక్తి ఎంత పెరుగుచున్నను వ్యాకరణము మాత్రము జీర్ణమగుటలేదు.(కొంచెము ఆగి) అసలీ పాడు వ్యాకరణము ఎవరికి జీర్ణమగును ? "మరణాంతో వ్యాధిర్వ్యాకరణమ్" అని ఊరకయే అన్నారా ? నాబోటి రసాస్వాదన తత్పరునకు ఈ వ్యాకరణము అన్నములో ఱాయివలె అడ్డుగదా ! దీని వలన ముక్తియా ? భుక్తియా ? అందులకే ఆదిశంకరులు "నహి నహి రక్షతి డుకృఞ్ కరణే" అన్నారు. నా తరువాత సంవత్సరమునకుఁ జేరిన తిరుపతిశాస్త్రి ఏ మంత్రము నుపాసించినాఁడో కాని వ్యాకరణ మతనికిఁ

గొట్టిన పిండయినది. (కొంచెము ఆగి) మంత్రము లేదు. తంత్రము లేదు. అతఁడు దోసకాయల నెక్కువగాఁ దినును. బహుశః అతని తెలివితేటల రహస్యము దోసకాయలో నుండి యుండవచ్చును. ఈ దినము నుండి దోసకాయలను అతనికి వండిపెట్టను. నన్నతఁడు గౌరవింపని కతమగూడఁ దీరును. ముందు చేరిన నన్ను గౌరవింపకపోఁగా అతని కంటెఁగూడ వెనుక చేరిన వేంకటశాస్త్రిని నెత్తిపైఁ బెట్టుకొనును. ఇది యే శాస్త్రమైనను అంగీకరించునా! కనీసము పాకశాస్త్రమునందైనఁ గుదురదే. (కొంచెమాగి) పాకశాస్త్రమన్న గుర్తుకు వచ్చినది. పాక శాస్త్రము ఈ తిరుపతిశాస్త్రి నాకడనే కదా అభ్యసించినది అందులకైనను నాపైని గురుభావ ముండవచ్చునే? (కొంచెము ఆగి ) తిరుపతిశాస్త్రి మాటకేమి? సర్వజ్ఞుఁడైన మా గురువుగారికిఁగూడ వేంకటశాస్త్రియన్న ఎంత గురి. ఎంత వాత్సల్యము. ముందువచ్చిన చెవులకన్న వెనుక వచ్చిన కొమ్ములు వాడి యన్న సామెత మా ఆశ్రమములో అతికినట్లు మఱెచ్చటను అతుకదు. ఈ మధ్య వేంకటశాస్త్రికి ఏదో పెండ్లి సంబంధము కూడ మాటాడినాడఁట. దూరపు బంధువునుగదా! నాకుఁ గూడ నొక మంచి కన్యను జూచి వివాహము చేయరాదా! ఎందులకుఁ జేయును? గోదావరి పుట్టుటొకచోట దాని ప్రయోజనము మఱియొక చోట.

(ఇంతలో మఱియొక శిష్యుఁడు ప్రవేశించును)

ద్వితీయుఁడు : ఏమోయి! మిత్రమా! క్షేమమా?

ప్రథ : (కొంచెము సేపు పరికించి) ఓహో! నీవా? ఆశ్రయము విడిచి నీవు రెండు సంవత్సరములు దాటినది కదా! నీ ఆకారములోఁ జాల మార్పులు వచ్చినవి. అందువల్ల వెంటనే గుర్తుపట్టలేక పోయితిని. కాని "సోఽయం దేవదత్తః" అన్నట్లు కొన్ని పోలికలుండుటచేత గుర్తుపట్టితిని. సరే. నా క్షేమమును జూచుచుంటివి గదా. నీవు వివాహమును జేసి కొంటివా?

ద్వితీ : ఇంకను లేదు. ఇచట మన సహపాఠకులందఱు క్షేమమే కదా!

ప్రథ : ఆ! ఆ! అందఱును క్షేమమే. ఇఁకఁ దిరుపతి వేంకటేశ్వరులను గూర్చి చెప్పఁబనిలేదు. వారి ప్రభ వెలిఁగిపోవుచున్నది.

ద్వితీ : (ఆశ్చర్యముతో) తిరుపతి వేంకటేశ్వరులా? వారెవరు? మన ఆశ్రమములోని విద్యార్థులా?

ప్రథ : అవును. దివాకర్ల తిరుపతి శాస్త్రిని, చెళ్లపిళ్ల వేంకటశాస్త్రిని ఎఱుఁగుదువు కదా ! వారిరువురు తిరుపతి వేంకటేశ్వర కవులుగా మారిరి. వారిలో ఎంత మార్పు వచ్చినదనుకొన్నావు. వేంకటశాస్త్రి వచ్చినదాక మనకుఁ దిరుపతి శాస్త్రికిఁ బెద్ద భేదములేదు కదా ! అతఁడు కుడిచేయిగా మనము ఎడమ చేయిగా నుండెడివారలము. ఇప్పుడో – అతఁడు పద్యములు చెప్పినంత వేగముగా మనము మాటాడనుగూడ మాటాడలేము. అతనిది ఆశుధార కాదు, బుగ్గధార. ఇఁక వేంకటశాస్త్రి శక్తిసామర్థ్యములు మన యూహకుఁ గూడ నందవు. అతని సంగతి పూర్తిగాఁ దిరుపతిశాస్త్రికైనను దెలియునా? యని నా అనుమానము. నాలుగు రోజుల క్రితము ఒక అంశము నిచ్చి ఆశువు చెప్పుమంటిని. అంతే, ఇంకేమున్నది. అక్షయతూణీరమునుండి వచ్చు బాణములవలె వారి నోటినుండి వచ్చు పద్యములకు అంతమే లేదు

ద్వితీ : చాల ఆశ్చర్యముగా నున్నదే. రామకృష్ణ పరమహంస గారికి వివేకానందుఁడు లభించినట్లు మన గురువుగారికి వీరు లభించిరన్నమాట. వారి సహపాఠివగుణ వలన నీకుఁ గూడ నేమైన కొంచెము కవితావాసన అబ్బినదా ?

ప్రథ : అబ్బక పోవుటేమి ? బాగుగా అబ్బినది. ఈ జంటకవులు గణపతి నవరాత్రములకు ముందు ఈ పరిసర గ్రామముల కేఁగి వారిని వీరిని ఆశుకవిత్వ ప్రదర్శనములతో, పురాణ పఠనములతో సంతోషింపఁ జేయుఁగా, ఆ దాతలిచ్చు ధనధాన్యములను, సాలువులను ఆశ్రమమునకుఁ జేర్చెడి వాసన అబ్బినది.

ద్వితీ : (నవ్వుచు) నీకును నాకును జదువుగీత లేదని యెప్పుడో తేలినది. సరే లే. వచ్చినందులకు వారినిఁగూడఁ జూచి వెళ్లెదను.

(నిష్క్రమింతురు)

– ఇది విష్కంభము –

ప్రదేశము - వేంకటగిరి

(ఒక చిన్న యిల్లు - తిరుపతి ప్రవేశించును)

తిరు : గురువుగారి యాదేశానుసారముగా ధనార్జన మిషచే సంచారముచేసి ఆశు కవిత్వములతో ఎండ అనో ముగ్గులను జేసినాము. నిడమర్రు గ్రామములో మొదటిసారిగా అష్టావధానమును జేయఁగా మా ప్రతిభకు సదస్యులు బొమ్మల వలెనైరి. "అవధానము చేయుఁడ"ని అప్పటినుండి వచ్చు ఆహ్వానములు లెక్కయే లేదు. కాకినాడలో పాదర్తి వేంకటరత్నముగారు కోరి మాచే శతావధానము గూడఁ జేయించిరి. ఈ యవధానముతో అష్టావధానులమేకాక శతావధానులము కూడ నయినాము. ఇప్పటి మా పరిస్థితి విచిత్రముగా నున్నది. కవితాకాంత ఏకాంతముగా నుండుమని ప్రాధేయపడును. కాని యశఃకాంత దేశములు త్రిప్పుచును. క్రమక్రమముగా యశఃకాంతావ్యామోహములో పడి మా వేంకటశాస్త్రి "ఓయీ! తిరుపతి! మనము వేంకటగిరి రాజదర్శనము చేయవలెను. అతని సందర్శన మందఱకు లభ్యమగునదికాదు. అటువంటి రాజును మెప్పింపవలెను" అని చెప్పఁగా నాతనిమాట కాదనలేక యీ వేంకటగిరి వచ్చినాము. సాక్షి మిత్రుని వాక్యము దాటనశక్యము. మైత్రిని మించిన బంధము మఱియొకటి లేదుకదా!

అతి రహస్యంపు సంగతికిఁ దాళపుఁ జెవ్వె
   మంచిచెడ్డలకుఁ జూపించు త్రోవ
కాలయాపనకు చక్కని యుపాయం బమి
   త్ర ధ్వంసమునకు ఫిరంగిగుండు
ఘనకార్యములకుఁ బెట్టిన పేరు దారిద్ర్య
   భంజనమ్మునకుఁ దుపాకిదెబ్బ
యాపన్నివారణ కౌషధ ప్రాయమ్ము
   తులలేని సుఖదుఃఖములకుఁ ద్రాసు

ఆత్మసంరక్షణమ్మున కిమ్మైన కోట
సంశయమ్మునకు పినాశ సమయ మరయ
సకల లోకోపకారంబు సలుపు సుజన
మైత్రికన్నను వేఱొండు మహినిఁ గలదె?

(అటు ఇటు చూచి)

ఏఁడీ! మా వేంకటశాస్త్రి "ఇప్పుడే పోయి సభను ఏర్పాటు చేయించు కొని వచ్చెదను" అని చెప్పి వెళ్లినాఁడు. ఇంతవఱకును రాలేదు. ఏమేమి యాటంకములు నడుమ తలెత్తినవో! (ఆకసమువంకఁ జూచి) సూర్య భగవానుఁడు కూడఁ దన దినచర్యను బూర్తిచేసికొని పశ్చిమాద్రికిఁ జేరు చున్నాఁడు. అహా! ఏమీ! యీ ఎఱుపు వర్ణము, పోవుచుఁ గూడ జగ మును సువర్ణమయము చేయుచు లోకబాంధవుఁ డగపించుకొనుచున్నాఁడు.

పద్మినీకాంత యపరదిగ్భామఁ గూడ
గాఁ జనెడి కాంతుఁ దా బలాత్కారముగను
లాగ, జాఱిన రక్తచేలంబనంగ
సంజకెంజాయ దోఁచె దిక్ప్రాంతములందు.

అప్పుడే కర్మసాక్షి కొండచాటునకుఁ బోయి దాగినాఁడే. అవును. పోక ఏమి చేయును?

వారకాంతను దవిలి తా వసువిహీనుఁ
డగుచు నిచ్చోట నిఁక నుండఁ దగదటంచు
వ్రీడచే సూర్యుఁ డస్తాద్రి వెన్కఁ జేరె
రిక్తులకు వారకాంతలు రిపులుగారె.

ఒక్క క్షణములో అపర దిగ్భామవదన మెంత కాంతిమంతమైనది. సూర్యభగవానుఁడు అస్తమించుచుఁగూడఁ దాను లోకమునఁ జూచిన నీతి నెంత రమణీయముగా సూచించుచున్నాఁడు.

పశ్చిమాచలమునఁ గాంతి పరిఢవిల్లెఁ
గాని తూరుపుకొండ రిక్తదశ నందె
నొకఁడు చెడిపోవు పైఁగాని యొకఁడు బాగు
పడుట లేదని జనులాడు మాట నిజము.

(ఆకాశమువంకఁ జూచి) ఇదుగో! చంద్రుఁడు కూడ వచ్చినాఁడు, కాని మా కవిచంద్రుఁడేఁడీ? ఇంకను రాలేదే.

(వేంకటశాస్త్రి ప్రవేశించును)

తిరు : ఏమి వేంకటశాస్త్రి ! ఇంత యాలస్యమైన దెందులకు !

వేం : (విసుగుతో) ఎందులకా ? పనిలేక వీధులన్నియుఁ దిరిగివచ్చితిని. ఈ యాస్థానములోని వ్యవహారమంతయు "దేవుఁడు వరమిచ్చినను బూజారి వరమీయఁడ" న్నటులున్నది. రాజు సాహితీప్రియుఁడే. కాని రాజదర్శనము లభింపవలదా ? ఆ మూలవిరాట్టును దర్శనము చేసికొనవలెనన్న, ఎన్ని ఉత్సవవిగ్రహములను బూజింపవలెను ? ఒక ఉత్సవవిగ్రహము యొక్క అనుగ్రహము సంపాదించుసరికి తలప్రాణము తోకకు వచ్చినది. ఏదోవిధముగ ఈ కృత్యాద్యవస్థను దాటితిని.

తిరు : రాజును దర్శించితివా ? సభ నెప్పుడు పెట్టిరి ?

వేం : ఇది యవధానము కాదు, నీ వడిగిన ప్రశ్నలన్నింటికి ఓర్పుతో సమాధానము చెప్పుటకు. త్వరపడక చెప్పునది వినుము. రాజదర్శనమునకు నొక ఏర్పాటు చేసితిని. అదేమన మనము ప్రభువునకొక "అర్జీ" వ్రాసి పంపెదము. దానినిఁ జూచి ప్రభువు తప్పక సభచేయించునని నేనూహించుచున్నాను.

తిరు : (నిట్టూర్పుతో) నీవు చేయించు రాజదర్శనము ఊహలలోనా ? సరియే. ఇఁక దర్శించినట్లే.

(ఆకాశములోని చంద్రునిఁ జూపించుచు)

అడుగో రాజు – దర్శింపుము. నీవు చేయింపలేని రాజదర్శనము నేను చేయించుచున్నాను. మనకు రాజదర్శనమైనది. ఇఁక నింటిమొగము పట్టుదము.

వేం : (కోపముతో) నీకు హాస్యముగా నున్నదా ! బరువు బాధ్యతలు కార్యభారము వహించువానికిఁ దెలియును. వంకలెన్నుటకేమి ? ఎన్నియైనను ఎన్నవచ్చును. "అడుగువానికిఁ జెప్పువాఁడు లోకువ" ఏదీ ! నీవు దర్శనమున కేర్పాటు కావింపుము. చూతము

తిరు : (తనలో) వీనికిఁ గోపము వచ్చినట్లున్నది. ఇతఁ డేదోవిధముగా తిమ్మిని బ్రమ్మి చేయఁగలడు. ఇటువంటి కార్యములకు నేనసలు పనికిరాను.

(ప్రకాశముగా) పట్టుదలలకేమిగాని, నీవుచేసిన ఏర్పాటేదో తెలుపుము

వేం : అట్లు దారికి రమ్ము. రాజుగారి అంతరంగికులలో నొకనిని వశపఱచు కొంటిని. "మీరు అర్జీ వ్రాసియిండు, నేనది రాజుగారికి నందఁ జేసెదను" అని అతఁ డుపాయమును జెప్పినాఁడు. అతఁ డిప్పుడే వచ్చును. ఆలస్యము చేయక చెప్పినది వ్రాయుము.

(తిరుపతి వ్రాయఁ బూనుట నటించును)

మహారాజ రాజశ్రీ ముద్దుకృష్ణయాచేంద్రులవారి సన్నిధికి శ్రీమత్పర దేవతా మహిమ సంప్రాప్తాశుధారా కవిత్వ ప్రథిత ప్రబంధ రచనా పారీణు లైన తిరుపతి వేంకటేశ్వర కవులు పంపు వినతి పత్రము.

తిరుపతి వేంకటేశ కవిధీరుల మేము శతావధానమున్
గరము రచింపఁగా బటిమ గల్గినవారము - శబ్ద శాస్త్ర ధీ
వరులము-సర్వపాపచయ భంజన రాజ దఖండ గౌతమీ
పరిదురు తీర వాసులము సారకళాకర ! యాచభూపతీ !

కాశీ సహస్రాది కావ్యమ్ములు రచించి
కాశీకృపం జెందఁ జాలినాము
ధాతురత్నాకరోద్దామ చంపు రచించి
పాణినీయ స్తుతుల్ వడసినాము
వేగమా పాణినీయాగమమ్ము పఠించి
మించి దేశికుల మెప్పించినాము
కాకినాడాది సద్గ్రామమ్ముల శతావ
ధానమ్ముచేఁ గీర్తిఁబూనినాము

ఇఁకను భవదీయ సన్నిధి నెపుడు మన్న
నలు లభించు నటంచు నిన్నాళ్ల నుండి
కలవరించుచు నుంటిమి కనుము కీర్తి
సాంద్ర ! శ్రీముద్దుకృష్ణయాచేంద్రభూప !

(ఇంతలో నొక వ్యక్తి ప్రవేశించును)

వేం : (అతనినిఁ జూపించి) మనకు సహాయము చేసెదనినన మిత్రుఁ డితఁడే.

తిరు : ఆప్తమిత్రులకు నమస్కారము. తమ రేమి చేయుదురు ?

వ్యక్తి: నమస్కారములు. నేనీ యాస్థానములో నొక ఉన్నతాధికారములో నుంటిని. రాజుగారిని దర్శించుటకు నాకెవరి యనుమతి అక్కరలేదు. నాకును గొంత కవిత్వపుఁ బిచ్చి గలదు. అందులకే మీ సభ చేయించి ఆనందింపవలెనని నా తహ తహ.

తిరు ; ఉత్తములకుఁ బరోపకారము సహజ లక్షణము కదా.

వ్యక్తి: అట్లనకుఁడు. దీనితో స్వార్థము తీర్థము కలసి వచ్చును.

తిరు : కృతజ్ఞులము.

వేం : తిరుపతీ ! మనమిట్లు పెద్దల కాలమును వ్యర్థము చేయరాదు. వ్రాయుము.

తిరు ; నిన్న వంట చేయునపుడు నా వ్రేలు కాలినది. నేను వేగముగా వ్రాయ లేకున్నాను. నీవే వ్రాయుము.

వేం : నా అక్షరములు నీ యక్షరములవలె స్ఫుటముగా నుండవుకదా ! సరే కానిమ్ము. నీవుకూడ రెండు పద్యములను జెప్పుము.

(తిరుపతి కాగితములందించును-
వేంకటశాస్త్రి వ్రాయుటకు సిద్ధముగా నుండును)

తిరు :
గంటకు నూఱు పద్యములు గట్టిగఁ జెప్పఁగఁ జాలినట్టి మా
వంటి కవీంద్ర సంతతినిఁ బండితులై తనరారునట్టి మీ
వంటి ధరా పురందరు లవారణ కారుణికత్వ మేర్పడన్
గంటికి జెప్పరీతిగను గన్గొను టొప్పనుగాదె భూవరా !

కఠినమ్ములగు ఱాళ్లు కఱపి కట్టిన రామ
భజనాలయమ్ములే పడక కాయెఁ
దాఁకిన మాత్రానఁ దనువు కట్టఁగఁ జేయఁ
జాలిన చలినీటి స్నానమాయె

నుడికియు నుడుకని కడువేఁడి మెతుకులే
యాఁకొన్న కడుపున కడ్డమాయెఁ
బ్రభువిచ్చె వేనూటపదియాఱులను నట్టి
స్వప్నమ్ములే ధనార్జనములాయె

ఎట్టులో యోర్చి బ్రతికితి మిన్నినాళ్లు
మరల నీలాటి కష్టముల్ మాకు దూర
తరములై యుండఁ జేయు మిత్తఱినిఁ గీర్తి
సాంద్ర ! శ్రీముద్దుకృష్ణయాచేంద్రభూప !

వేం : చాలును. నేను సంతకము చేసితిని. నీవుకూడఁ జేయుము.

(కాగితము నందించును – తిరుపతిశాస్త్రి సంతకముచేసి కాగితము క్రొత్త వ్యక్తి కొసంగును)

వ్యక్తి : నేనిప్పుడే మీకు వార్త నందింతును.

వేం : కార్యసిద్ధిరస్తు.

(వ్యక్తి నిష్క్రమించును)

తిరు : ఈతఁడీ కార్యము సాధింపఁగలఁ డందువా ?

వేం : నీ కన్నియు సందేహములే.

తిరు : సందేహమనిన గుర్తుకు వచ్చినది. పాండవోద్యోగ నాటకములో నెక్కువ భాగము నీవు వ్రాసినదే కదా! ఎట్లు వ్రాసితివోయని పరిశీలించుచుండ ఒక సందేహము వచ్చినది.

వేం : ఏమది ?

తిరు : కృష్ణునిచేతఁ గర్ణ జన్మవృత్తాంతమును జెప్పించునపుడు

కన్నెప్రాయంబునందు భాస్కరుని కరుణఁ
బది నెలలు మోసి నినుఁ గన్న పడఁతి కుంతి
చేరఁగాఁదీసి నిన్నుఁ బెంచినది రాధ
నీవు రాధేయుఁడవు గావు నిశ్చయముగ.

అని వ్రాసితివి గదా ! కర్ణుడు కుంతికి సద్యోగర్భంబునఁ బుట్టి నట్లు నన్నయభట్టారకుఁడు వ్రాసినదానికి విరుద్ధమగును గదా ! అటువంటి ప్రసిద్ధ విషయమును మార్చవచ్చునా ?

**వేం :** (నవ్వుచు) నీవుగూడ నా మాయలోఁ జిక్కినావన్నమాట. నన్నయ యట్లు చెప్పినమాట నిజమే కాని, ఎట్టా పెగ్గడ మాత్రము పదినెలలు మోసి కన్నట్లు చెప్పినాఁడు ఎవరైనను నన్ను అడిగినచో "ఆరణ్యపర్వమును జూడుఁడు" అని చెప్పఁదలఁచియే యిట్లు వ్రాసితిని.

**తిరు :** (ఆశ్చర్యముతో) నీవు వేయి జిత్తులు అవధానములందు మాత్రమే యను కొంటిని. సాహిత్యములోఁ గూడ వేయుచుంటివా ? అలవా టెక్కడికి బోవును.

**వేం :** (నవ్వుచు) ఏదో ఒక చమత్కారము చేయనిదే నాకుఁదోఁచదు. ప్రస్తావన తెచ్చితివి గాన చెప్పుచుంటిని. శ్రవణానందములో ఒక అర్థములేని పద్య మును వ్రాయబోవుచున్నాను.

(ఇంతలో నొక సేవకుఁడొక కాగితమునిచ్చి నిష్క్రమించును — వేంకటశాస్త్రి చదివి బాధపడుచుండును)

**తిరు :** ఏమూ లేఖ ? చదివి అట్లైతివేమి ?

**వేం :** ఏమున్నది ? క్రొత్త వ్యక్తి "రాజదర్శన మిప్పింపలేక పోయితిని క్షమిం పుము" అని వ్రాసి పంపినాఁడు.

**తిరు :** ఈ యనుభవము భవిష్యజ్జీవితమున కెంతయో మంచిది. ఈతని దర్శనము లభింపని మాత్రమున వచ్చిన లోపమేమి ? ఈతఁడేమి హరియా ? చతు ర్ముఖుఁడా ? ఇతఁడు కాకపోయిన మఱియొకఁడు. మనకు క్షామముకాని, నృపతులకు క్షామములేదు కదా !

**వేం :** తిరుపతీ ! "అందని ద్రాక్షపండ్లు పుల్లన" యనునట్లున్నది నీ విధము. అదేమి గ్రహచారమోకాని ఇప్పటికిని ఈ యాశను జంపుకొనలేకున్నాను.

"శని తాఁ బట్టిన ఏడు వత్సరములే చల్పాదియై బాధ సే
యును నీవో పదునాలుగేండ్ల" నెడి సామ్యోక్తుల్ స్మరింపంగఁ జే
సెనహో! "ముద్దులమూట కృష్ణుఁ డితనిన్ సేవింపఁగారాద" టం
చనవో యాశ! దురాశ నీకుఁ గడుఁ బెద్దై యుండఁ గాన్పించునే

ఒకవేళ మన మెక్కువ యాశపడి అవి యివి కోరితి మనుకొందమా—

కనకాభిషేకమ్ముఁ గావింపుమనలేదు
వెయ్యాఋ లిమ్మని వేఁడలేదు
భోగాలనిచ్చి యారేగింపు మనలేదు
సింహాసనమ్ము లాసింపలేదు
పల్లకీనిచ్చి సంభావింపు మనలేదు
పడగ లిమ్మనియైన నొడువలేదు
గండెపెండేరమ్ముఁ గావలె ననలేదు
మాన్యమ్ము లిమ్మని మనవిలేదు

ఒక్కసభచేసి తోచిన వక్కలాకు
లిచ్చి పంపించు మనుటకే యింతలాయె
నిలఁ గవీశ్వరులనుట నవ్వులకుఁ జేటు
కాక యేమున్నదయ్య యీ కాలమందు.

తిరు: ఓయీ! వేంకటశాస్త్రి; అసమాన ప్రతిభాధురంధరుఁడవయ్యు ఎవఁడో ఒక రాజు దర్శన మొసఁగలేదని యేల బేలవోలె గోలెత్తెదవు?

వేం: తిరుపతీ! నా ప్రకృతి నీకు బాగుగాఁ దెలియును గదా! అవమానమును సహింపలేను. ఈ విషయము తెలిసికొని లోకము మనలను జూచి పరిహాసింపదా?

"కులుకుచుఁ బోయియుండి రటకున్ బ్రభువర్శన మీమొగాలకే యలవడునే ?" యటంచు జనులందఱు నాడఁగలారటంచుఁ జింతిలిదెను – చింతసేయను మదిన్ మఱియొండు – మగండు కొట్టినందులకు సహింపవచ్చు నది తోడిది దెప్ప సహింపవచ్చునే ?

తిరు : అదియా నీ బాధ. ఆ బాధ నాకు మాత్రము లేదా ? మరల ఈ రాజుచే రప్పించుకొనునట్లు మన ప్రతిభను లోకమునందుఁ బ్రదర్శింతముగాక.

వేం : తథాస్తు.

(నిష్క్రమింతురు)

ఇ ది ద్వి తీ యాం క ము

# తిరుపతి వేంకటీయము

## తృతీయాంకము

(లక్ష్మీకాంతమను విద్యార్థి ప్రవేశించును)

లక్ష్మీ : నా తరముకాక యున్నను
జేతులు జోడించుకొనుచుఁ జేసెద దానిన్
నీ తలఁపు దెలుపు మఖిల ధ
రాతల పతిమౌళిరత్న రంజిత చరణా!

ఆహాహా! ఏమి పద్యము? ఈ పద్యములోఁ బ్రతి పదము ఎంతెంత అర్థమును ధ్వనింపఁజేయుచున్నది. సంబోధన మెంత భావికార్య సూచకముగా నున్నది, "నా తరము కాకయున్నను, చేతులు జోడించుకొనుచు, నీ తలఁపు దెలుపుము" అను పదము లెన్ని యర్థములను సూచించుచున్నవి.
(శివరాముఁడను విద్యార్థి ప్రవేశించును. అది గమనింపకయే లక్ష్మీకాంతము చదువుచుండును)

సంజయు రాయబారమున సారమెఱింగితి మాతఁ దెల్పు మీ
కుంజను శాంతి వారలకుఁ గోపమ యొప్పెడి మీకు విశ్వపం



గంజి రుచించు వారలకుఁ గమ్మని పాలు రుచించు మీకు నై
వింజపుముట్టై వారికయి పృథ్వి జనించె నటంచుఁ దెల్పెడిన్

సంజయు రాయబార సారాంశమును ఇంత చక్కఁగా వ్యాఖ్యానించిన కవి యెవఁడున్నాఁడు ?

శివ : (చప్పట్లు చఱచును)

లక్ష్మి : (శివరాముని జూచి)

బావా ! ఎప్పుడు వచ్చితీవు ? సుఖులే భ్రాతల్ సుతుల్ చుట్టముల్.

శివ : ఏమి లక్ష్మీకాంతము ? నేను వచ్చినదిగూడ గమనింపకుండ ఒడలుమఱచి చదువుచున్నావు ? "నాకు ధర్మజునిపాత్ర ధరింపవలెనని ఆసక్తియున్నది" అని కదా నాతో నొకసారి చెప్పితివి. మరల నీవు శ్రీకృష్ణపాత్ర ధరించుటకు సాధనము చేయుచుంటివా యేమి ?

లక్ష్మి : (నవ్వుచు) నేనూరక చదువుచుంటిని, నీవు చెప్పినమాట సామాన్యనాటకములకు వర్తించును. ఎందులకనగా సామాన్య నాటకములలోని పద్యములు పాత్రధారులకు మాత్రమేవచ్చును. కాని మన గురుదేవులు వ్రాసిన భారత నాటకాలలోని పద్యములు ప్రేక్షకులకుఁ గూడ వచ్చును. గొడ్లను కాచుకొను బాలురలోఁగూడ ఈ నాటకములలోని పద్యములు కనీసము పదియైన రానివాఁడు లేఁడు. అవునా ? కాదా ?

శివ : అవును. నీవన్న మాట యథార్థము. పూజ్యులగు శ్రీ తిరుపతి వేంకటేశ్వరులకు పండితులను, పామరులను రంజింపఁజేయు శక్తికలదనుటకు ఈ నాటకములు పరమ ప్రమాణములు.

లక్ష్మి : దానికొకటే కారణము. వీరికి లౌకిక జ్ఞానము హెచ్చు. లోకమే విరుపఠించిన గ్రంథము. అందువల్లనే వీరి కవిత్వము ఛాందసపు ముత్తైదువవలె నుండక స్థాపితజనాకర్షణ యంత్రమూర్తివలె నుండును. ప్రాతరీతులన్న పెడమొగము పెట్టువారికి, క్రొత్తపోకడలన్న కొంకెచూపు చూచువారికి వీరి శ్రవణానంద కావ్యము శ్రవణానందకావ్యమైనది కదా !

నీవును ఎన్ని సారులో పఠించితివికదా! నా యభిప్రాయము సత్యమగునా? లేక గురువుల గ్రంథమని పక్షపాతముతో ననుచున్నావా? నీ యభిప్రాయమేమి?

శివ: "ఎన్నిసారులో పఠించితివి కదా" యని యనుచునే మరల నీ యభిప్రాయమేమని యడుగుట నవ్వు వచ్చు చున్నది. "సూర్యుడు ప్రకాశించును" అని అనుట ఎంత సత్యమో నీ మాట అంత సత్యము. ఈ సత్యమును ఒక పాఠకుఁడెంత పరవశించి చెప్పినాఁడో వినుము.

> ఒక శ్రవణా నందమ్మున
> నొక పద్యము నందుఁ గలుగు నొక పాదమునం
> దొక యక్కరమున కిచ్చిన
> సకలంబగు రత్నగర్భ చాలునె తూఁపన్.

లక్ష్మి: సత్కవుల కవిత్వము చదివిన సత్కవిత్వము పుట్టుననుటకు నుదాహరణముగా నున్నదీ పద్యము. కాని యదేమి చిత్రమో! గురువులకు దీని మీఁదఁగంటెఁ బాణిగృహీత మీఁద మంచి చూపున్నది. గమనించితివా?

శివ: పాణిగృహీతలో ఎన్నో మంచి పద్యము లుండుటయే దానికిఁ గారణము-పాణిగృహీత జన్మ వృత్తాంతము అతి విచిత్ర మైనది.

లక్ష్మి: విచిత్రమా? ఏమది?

శివ: గురువులు శ్రవణానందము నొక కావ్యముగా వ్రాయు నుద్దేశముతో వ్రాయలేదు. వారక్కడక్కడ చెప్పిన పద్యములు పోవునని ఒక కథా సూత్రమేర్పరచి ఈ పుస్తకముగాఁ గూర్చినారు. ఆ పద్యము లింకను మిగలగా పాణిగృహీత యను పేరుతో నింకొక పుస్తకముగా గ్రథనము చేసిరి. ఇంకను గొన్ని పద్యములు అచ్చుగాక మిగిలిపోయినవి. ఆ కారణముచేతనే ఆ రెండింటిలోఁ గథ ఒకటిగనే యుండును కాని లోకమునకు శ్రవణానందము పాణిగృహీతమైనట్లు పాణిగృహీత శ్రవణానందము కాలేదు.

లక్ష్మి: తండ్రికిఁ బాణిగృహీతయైన పుత్రిక నచ్చుట యేమి? రసికులకుఁ బాణిగృహీత నచ్చకపోవుటేమి? అతి విచిత్రితముగా నున్నదే.

శివ : నీ శ్లేషలకేమి గాని, పాణిగృహీతలోని రెండు పద్యములను జదువుము. పద్యము చదువు పద్ధతి నీకబ్బినట్లు మరెవ్వరికి నబ్బలేదుగదా!

లక్ష్మి : నా యభిరుచి నీ యభీష్టము ఒకటియైనది. తప్పక చదివెదను.

మనసు దీఱఁగ నొక్కమాఱు చూచిన గండ
శిలలకైనను గుండజల జనించుఁ
జనువు మీఱఁగ నొక్కసారిముట్టిన నుక్కు
కంబాలకును బులకలు పొసంగుఁ
గులుకుచు నొకసారి పలుకరించినఁ బిచ్చ
వానికైనను గచ్చ వదలి పోవుఁ
బదనుగా నొకమాఱు భావమ్ము సూచింప
బమ్మకైనను బుట్టు రిమ్మతెవులు.

ముదువు మురిసిన ముద్దులు మూటగట్టుఁ
బలుకు పలికినఁ దేనెల వాన గురియు
నవ్వు నవ్వినచోట రత్నాలు రాలు
కలిత లావణ్యపేటి యక్కాము ఘోటి.

బిబ్బోకవతి గబ్బి గుబ్బదోయినిఁ జూడ
మతిమాలి బతిమాలు యతియు రతికి.

(ఇంతవఱకుఁ జదివి గుర్తురాని యట్లు నటించును)

శివరామా! ధారణ నీకున్నంత నాకు లేదు. అందులకేకదా అవధాన రహస్యము లన్నియు గురువులు నీకు వివరించిరి. చదువుము.

శివ : బిబ్బోకవతి గబ్బి గుబ్బదోయినిఁజూడ
మతిమాలి బతిమాలు యతియు రతికి
ఉడురాజముఖి కంటఁ బడి దాని జడఁ జూడ
జడదారి పెడదారిఁ జనఁగఁ దివురు.

కన్నె మిన్నె బెడంగు కన్ను సన్నలు గన్నఁ
    గన్నవాఁడును దాల్మి సున్నఁజేయు
గల్కి ముద్దులు గుల్కు చిల్కపల్కుల కుల్కి
    పల్కరింపఁగఁ జూచుఁ గల్కియైన

నొంటిపాటునఁ జెలి కడనుండె నేని
దత్తరమ్మున వేదాంతి మెత్తవడును
చెలి శరీరమ్ము నొకపరి చేస్పృశింపఁ
బుంస్త్వ మొదవింపఁ జేయు నపుంసకునకు.

లక్ష్మి : (ఏదో గుర్తుకు తెచ్చుకొనినట్లు నటించి) పద్యపఠన మింకఁ జాలును మఱచిపోయితిని. నేఁడు నాగరత్నమను వేశ్య యొక్క పాటకచ్చేరి కలదు. గురువులతో మనము చూచుటకు వెడలవలెను.

(నిష్క్రమింతురు)

— ఇది విష్కంభము —

## గద్వాల ఆస్థానము

### అభినవ భారతీ మందిరము

(పంగనామములతో ఆస్థాన పండితుఁడగు నొక వైష్ణవుఁడు ప్రవేశించును)

ఆచా : (తనలో) ఈ తిరుపతి వేంకటేశ్వరుల పీడ నాకు వదలునట్లు లేదు. వీరు వెనుక నొకసారి రాజదర్శనమునకు వచ్చిన, ఉన్నవి లేనివి ఏవియో ప్రభువునకుఁ జెప్పి వీరికిఁ బ్రభుదర్శనము కానీకుండఁ బంపివైచితిని అది వారు తెలిసికొని 'శని' యను పేరుతో నన్నుఁ బద్యములలోఁ దిట్టి పోసి నారఁట. నన్నుఁ దిట్టిన వారిని ఈ యాస్థానపుఁ బొలిమేరలోనికిఁ గూడరానీయరాదని నేననుకొనుచుండ, వారి ప్రతిభ ఆనోట ఆనోటఁబడి ప్రభువునకుఁ దెలిసినది. లోకము మూయఁగ మూకుడున్నదా ! వెనుకటి వలె నగునని యెంచి, నాకుఁ దెలియకుండఁగనే వారు ప్రభువునకు వర్తమాన మంపిరి. ప్రభువు దాని కంగీకరించి "నేఁటి సాహిత్యసభకు ఆ జంటకవులను రప్పింపవలసినది" అని నాకే కబురు పెట్టిరి. అసలే ఈ జంటకవులను జూచిన నా కొడలు మండుచుండ "గోరుచుట్టుపై రోఁకటి పోటన్నట్లు" వీరిని ఆహ్వానించు కార్యముగూడ నాపైఁ బడినది. ఏమి చేయుదును ? విధిలేక వర్తమాన మంపితిని. మంత్రికిఁ గూడ నా మీఁద నంత సద్భావము లేదు. వీరంజఱు కూడి నా కెక్కడ ముప్పు తెచ్చెదరో యని భయముగా నున్నది. నాకు శాస్త్రమందున్న ప్రవేశము సాహిత్యము నందు లేదాయె. కట్ట కాగితములు పాడు చేసినను గందపద్య మల్ల లేను. లేనిచో వీరి యాటలను సాగంతునా ? ముందు నుయ్యి వెనుక గొయ్యిగా నున్నది నా పని. నా వైష్ణవమాయలు వారికడ సాగవు కానిమ్ము. చేతనైనంతలోఁ గిలెటిఁగి వాత పెట్టుట తప్ప మఱియొక మార్గము లేదు.

(తెరలో)

(రాజాధిరాజ ! రాజ పరమేశ్వర ! రాజ కంఠీరవ ! సత్కవి చకోర చంద్ర ! శ్రీ శ్రీ శ్రీ రామభూపేంద్ర బహూపరాక్ బహూపరాక్.)

(ప్రభువు మంత్రిసహితముగాఁ బ్రవేశించును. ఆస్థానపండితుఁడు భక్తిశ్రద్ధలతో నమస్కరించును.)

ప్రభువు : ఆచార్యవర్యా ! ఆసనము నలంకరింపుఁడు

(ఒక ఆసనముపైఁ గూర్చుండఁ బోవును)

ఆ యాసనము నందుఁ గూర్చుండఁ బోవుదురేమి ? అది సామాన్యుల కొఱకున్నది.

(వేఱొక యాసనమును జూపించి)

ఈ పరీక్షాధికారి యాసనము నలంకరింపుఁడు.

ఆచా : (తనలో) ఈ రోజుతో నాకు ఈ యాసనమునకు ఋణము తీరునేమో.

(ప్రకాశముగా) దేవరవారి యాజ్ఞ

ప్రభువు : ఆ కవులకు వర్తమాన మంపితిరి గదా !

ఆచా : పంపితిమి ప్రభూ ! వారీపాటికి ద్వారమువద్ద వేచియుందురు.

మంత్రి : ఎవరురా అక్కడ ? ద్వారమువద్ద ఇద్దరు కవులుందురు. ప్రవేశ పెట్టుము.

(తెరలో)

చిత్తము.

(తిరుపతి వేంకటేశ్వరులు ప్రవేశింతురు)

తిరు. వేం : జయము జయము మహాప్రభూ !

మంత్రి : (ఎదురేఁగి) దయచేయుఁడు.

వేం : శ్రీరస్తు శ్రిత రక్షణక్షణ గుణ శ్రీరస్తు నిత్యోత్సవ

తిరు : శ్రీరస్తు ప్రథమాన కీర్తి విభవ శ్రీరస్తు గీరస్తుతే

వేం : శ్రీరస్త్వి త్యతివేల పండిత వచః శ్రీరస్తు భూరస్త్వహో

తిరు : శ్రీ గద్వాల పురోత్తమ ప్రభుమణే ! శ్రీరామ భూపాంకా !

ప్రభు : ఆసనముల నలంకరింపుఁడు.

(కవులు కూర్చుందురు)

ఆరా : "ప్రథమ కబళే మక్షికా పాతః" అన్నట్లు మీ అశీర్వచన శ్లోకమునందే లక్షణము తప్పినది. యతి కుదిరినది కాని ప్రాస నాల్గవ పాదములోఁ దప్పినది. యతిస్థానములో గూడ 'శ్రీ' అను అక్షరమునే ఆవృత్తిచేసినారు. మీ ఆశుకవిత్వములో ఇచ్చట ఎవరును యతి ప్రాసలు గుర్తింపలేరనుకొంటిరేమొ.

(ఏదో సర్ది చెప్పుచున్నట్లు సూచించి హేళనగా)

పొరపాటులకేమి లెండు. చెప్పఁడు.

(తిరుపతి వేంకటేశ్వరులు నవ్వు మొగము పెట్టెదరు)

మంత్రి : ఆచార్య ! పొరపాటు వారిది కాదు. మీది. లక్షణము నెఱుఁగక మాటాడుట ఉత్తమ లక్షణముకాదు. ప్రాస నియమము తెనుఁగు నందే కాని సంస్కృతము నందు లేదు. యతి సంస్కృతమందున్నను అచట నది కేవలము విరామమే యతి స్థానమునందు మిత్రాక్షర ముండవలెనని సంస్కృతమున లక్షణములేదు. యతిస్థానమున మిత్రాక్షర ముండవలెననుట తెనుఁగు సంప్రదాయము. వీథి పాఠశాలలోఁ బఠించువిద్యార్థులు కూడ నెఱిఁగిన యీ ప్రాథమిక విషయము తెలియక యసూయాపరుఁడవై ఏల వారల నాక్షేపించెదవు ?

తిరు. (వేంకటశాస్త్రితో - జనాంతికముగా)

ఈ యాస్థానపండితునికన్న మంత్రియే కొంత మెఱుఁగు.

(పండితుఁడు సిగ్గుతోఁ దల వంచుకొనును)

ఆచా : (తనలో) వారి నవమానించు తొందరలో ఎంత పొరపాటు చేసితిని. అసూయ తెలిసిన విషయములనుగూడ స్ఫురింపఁ జేయనీయదు కదా !

ప్రభు : "ప్రమాదో ధీమతా మపి" దానికేమిలెండు.

(కవులవంకఁ దిరిగి)

తిరుపతి వేంకటేశ్వరులు చెరియొక పద్యము చొప్పునఁ జెప్పుదురని వింటిమి. ఒక్క పద్యమునే యిద్దరును జెప్పుదురని వినలేదు. బాగుగానున్నది.

వేంక : మేమా రెండు పద్ధతుల యందును జెప్పఁగలము. సహవ్రతులమే కాక సమ ప్రతిభులమని తెలుపుటకు ఇట్లు చేయుచుందుము.

ఒక చరణం బతండు మఱియొక్కటి నేను మఱొక్క టాతఁడున్
సకల కవీంద్ర సంతతులు సమ్మతిచేఁ దలలూచి మెచ్చఁగాఁ
బ్రకట తరాశుధార దనరన్ రచియింపఁగ నేర్తుమయ్య "నూ
టికి సెల" గయ్య నిక్కమిది డెబ్బదిమాటలు చెప్పనేటికిన్.

ఆచా : (అసూయతో ముఖము చిట్లించుకొని) నూఱుల కొలఁది పద్యములు వినుటకు ఇక్కడ నెవరికి అంత తీరికలేదు.

ప్రభు : ఆచార్యా ! వినుటకే కదా ఆహ్వానించినది.

మంత్రి : (ఆచార్యుని వంకఁ దిరిగి) మీరు వినలేనిచో వెడలవచ్చును.

ఆచా : (తనలో) ఈ మంత్రి నన్ను అవమానించుటకే నిశ్చయించుకొన్నట్లు దీనితో స్పష్టమైనది. ప్రభువుకూడ ఈ కవితాగోష్ఠియం దాసక్తిని సూచించుచున్నాఁడు. నన్ను వారు కోరి ఏదైనను అడుగువఱకు మౌనముగా నుండుట శ్రేయస్కరము. లేనిచో భుక్తికే ముక్తి కలుగును.

ప్రభు : కవులారా ! మీ ప్రతిభను గూర్చి ప్రజలు చిత్ర విచిత్రముగా శ్లాఘించుట యెంటిమి. జనుల నంతగా వశీకరణ మొనర్పఁ గల్గిన అస్త్రములు మీ యొద్ద ఏమి కలవు ?

వేం : ప్రభూ ! తెలిపెదను. చిత్తగింపుఁడు.

శతఘంట కవనమ్ము సల్పు సంగతియన్నఁ
గరతలామలకమ్ము గాదె మాకు
అష్టావధాన కష్టావలంబనమన్న
నంబి కొండయ దండనంబు మాకు

ఆశుధారా కవిత్వాడంబరంబన్న
నల్లేరుపై బండి నడక మాకు
సత్కావ్య నిర్మాణ చాకచక్యంబన్న
షడ్రసోపేత భోజనము మాకు

(ఆస్థాన పండితుని వైపు చూచి)

వ్యర్థమగు వాదము లొనర్చునట్టి వారి
దంబ మణఁగించు టాపోశనంబు మాకు
దానరాధేయ ! కవి సముదాయ గేయ !
పండిత విధేయ ! రామభూపాల రాయ !

ఆచా : (తనలో) వీరు నన్ను వదలునట్లు లేరు. "నంబి కొండయ దండనంబ మాకు" అను దానిలో నాపై శ్లేష లేదు కదా ! ఉన్నను చేయున(?) ఏమున్నది ? దొంగకుఁ దేలు కుట్టినట్లున్నది నా పని.

మంత్రి : మీ ధోరణిఁ జూచిన పండితులకు వాగ్బంధనము చేయుటమీఁదనున్న(?) చూపు కోమల కవితపై లేనట్లున్నది.

తిరు : మేము పండితుల యొద్ద పండితులము కాఁగలము. బాలురయొద్ద బాల(?) రము కాఁగలము ఎక్కడ ఏది ఎట్లు చెప్పిన ఉచితమగునో అ(?) చెప్పుట మా ప్రత్యేకత.

ముద్దు ముద్దుగఁ జెప్పఁ బూనితిమా, పన్నె
లాఁడి తీయని మోవి లంచమిచ్చుఁ
గఠినమ్ముగాఁ జెప్పఁ గడఁగితిమా, ప్రౌఢ
కాంత వక్షోజముల్ కానుక లొసఁగుఁ
దీక్ష రీతినిఁ జెప్పఁ దొడఁగొంటిమా, వాలుఁ
గంటి లేఁజూపు సుంకమ్మొసంగు
మిశ్రరీతినిఁ జెప్ప మేకొంటిమా, బోఁటి
బిగువు కౌఁగిలి పన్నుఁ బెట్టితీఱు

నాశుధారా కవిత్వమ్ము నందుకొంటి
మేని యభిసారికయు ఎంకమిచ్చి తీఱు
నాంధ్ర గీర్వాణ భాషల యందు మాకు
దళిత పండితలోప ! గద్వాల భూప !

ప్రభువు : ముత్యాలతోఁగూడిన దారము శిరోధార్యమగునట్లు మీ చక్కనిపద్యముతో పాటు నేనుగూడ రసికుల రసనాగ్రములపై నుండునట్లు చేసితిరి.

మంత్రి : అశుకవిత్వమునందు వీరి ప్రతిభ అసాధారణమని జనులాడు మాటవాస్తవము. స్తవము కాదు.

ప్రభువు : అవును, గీర్వాణాంధ్రములందు పాండిత్యము కలదని వారు చెప్పిరిగదా! పరీక్షింపుఁడు.

మంత్రి : చిత్తము, దానికి ఆస్థాన పండితులే అర్హులు. (ఆచార్యుని వంకఁ దిరిగి) ఆచార్యవర్య ! ఏదేని ఒక క్లిష్టమైన సమస్యను వీరికిండు.

ఆచా : (తనలో) ఇప్పటికి ఈ కవులు నా చేతికిఁ జిక్కినారు. ఎంత కష్టమైనది యిచ్చినను ప్రభువులకుఁ గోపము రాదు. (ప్రకాశముగా) చిత్తము.
పండితులారా ! ఇదిగో త్రిపాద సమస్య, అనఁగా నేనిచ్చు సమస్యలో మూఁడు పాదము లుండును. ఒక పాదమునకు మఱియొక పాదమునకు సంబంధ ముండదు. మీరు నాల్గవ పాదమును బూర్తిచేసి, మొత్తము నాలుగు పాదములకు అన్వయమును గూర్పవలెను.

మంత్రి : మీరు తయారుచేసిన సమస్యయా ? అయినచో తప్పులుండునేమో యని నా భయము. ఇప్పుడు మీరు పరీక్షాధికారులు సుమా ! మీ రిపుడు తప్పు చేసిన ఎడల మందఱము నవ్వులపాలగుదుము.

ఆచా : (తనలో) ఒక్క చిన్న పొరపాటు చేయుటవల్ల ఈ దినము ఎన్ని మాటలు పడవలసి వచ్చినది.

ప్రభు : (నవ్వుచు) పరీక్షకుఁడు ప్రతిభావంతుఁడైనచోఁ బరీక్షితునకుఁ గూడ మోదము కల్గును. ఆచార్యా ! కానిండు.

ఆచా : రామాయ రామభద్రాయ
తపస్స్వాధ్యాయ నిరతం
వేణీ సంహార నాటకం

(కవులు ఆలోచించు చుందురు)

మంత్రి : (తనలో) ఈ యాచార్యుఁడు వారిపైఁగల అసూయను మూఁడు పాదాలలో మూర్తీభవింపఁ జేసినాఁడు. ఈ కలియుగమున మూఁడు పాదములు అధర్మము, ఒక్క పాదము ధర్మముండునని యందురు. ఇతఁడు మూఁడు పాదముల సమస్య నిచ్చి తన అధర్మంపు బుద్ధినిఁ బ్రదర్శించినాఁడు. ఈ కవులు మాత్రము సామాన్యులా !

(అందఱు కవుల వంకఁ జూచుచుందురు. తిరుపతి చెప్పఁబోవును అతనిని వేంకటశాస్త్రి వారించును)

వెం : ప్రభూ ! ఇదిగో పూర్తి చేయుచున్నాను.
తపస్స్వాధ్యాయ నిరతం
గురుం నత్వా కరోత్కవిః
రామాయ రామ భద్రాయ
వేణీ సంహార నాటకమ్

(అందఱును చప్పట్లు కొట్టెదరు)

మంత్రి : (ఆచార్యునితో జనాంతికముగా)

'తపమునందు. స్వాధ్యాయమునందును నిపుణుఁడైన గురువునకు నమస్కరించి శ్రీరామాంకితముగాఁ గవి వేణీసంహార నాటకమును వ్రాసెను' అనియే కదా తాత్పర్యము.

(ఆస్థాన పండితుఁడు తలయూపును.)

ప్రభు : గీర్వాణములో నిచ్చిన సమస్యను బండితామోద యోగ్యముగాఁ బూరించినారు. తెనుఁగులో నేనొక సమస్య నిచ్చెదను. పూరింపుఁడు. సంస్కృతమున కిచ్చిన గౌరవము మీరు తెనుఁగున కీయరేమో.

వేంక : అది పరప్రత్యయనేయ బుద్ధులగువారి యభిప్రాయము.

తెలుఁగు తెలుఁగని యద్దాన దిగుటెకాని
సంస్కృతమ్మునకన్నఁ గష్టమ్ము హెచ్చు
ఒక్కదానఁ బరిశ్రమ మున్నఁ జాలు
దాని, కిద్దానికో రెంటఁ దగులవలయు.

ప్రభు : సంస్కృతమును మాత్రమే యభ్యసించి తెనుఁగు నీసడించువారికి ఈ యభిప్రాయము నచ్చదేమోకాని ఉభయ భాషలయందుఁ బ్రావీణ్యమున్న వారి యెడల మీ యభిప్రాయము లవమ్ము వమ్ము కాదు.

ఆచార్య : తెనుఁగు ముందు సంస్కృతము తీసికట్టనియా మీ యభిప్రాయము.

తిరు : మా యభిప్రాయ మదికాదు. తెనుఁగునకున్న వ్యాకరణ దీపము చిన్నది. ఒక్క వ్యాకరణమే యన నేల ? ఛందస్సు, అలంకారములు అవి యివి యన నేల? ఎన్నియో లక్షణములు సంస్కృత లక్షణములే కదా ! కనుక తెనుఁగు రావలెనన్న సంస్కృతము రావలెనని మా యభిప్రాయము. అంతే కాని సంస్కృతభాష తెనుఁగు భాషకన్న హీనమని మా భావము కాదు. ఆ మాటకువచ్చిన ప్రతి భాషకుఁ గొన్ని సహజ లక్షణము లుండును. దేని శక్తి దానిదే,

తెనుఁగునఁ గొన్ని సంగతులు తియ్యనలై యలరారు సంస్కృతం
బున మఱికొన్ని సంగతులు ముద్దులు మూటలు గట్టఁజాలు, నిం
దును మఱియందునున్ సొబగుతోఁ దులదూఁగును గొన్ని సంగతుల్
పనిగొని చెప్పనేల యది పండిత వేద్యము కాకయుండునే ?

ఆచా : (తనలో) వీరు "ఊ" అనిన ఒక పద్యము "ఆ" అనిన ఒక పద్యము చెప్పుచున్నారే. వీరు నిజముగా సరస్వతీ వర ప్రసాదులే.

ప్రభు : నేనడుగఁ దలఁచిన తెనుఁగు సమస్య మఱియొక విధమగు తెనుఁగు సమస్యగా మారినది.

వేం : (నవ్వుచు) సెలవీయుఁడు

ప్రభు : "సంధ్యావందన మాచరింపవలదా ? చౌశీతి బంధమ్ములన్"

ఆచా : (తనలో) చౌశీతి బంధములు కామ కళకు సంబంధించినవి. ఆ బంధాలతో సంధ్యావందన మాచరింపవలెనా ? చిత్రముగా నున్నదే. ప్రభువులకు పీరి ముఖములు చూచి మతి భ్రమణము కలుగలేదు కదా !

తిరు : ప్రభూ ! అవధరింపుఁడు.

"సంధ్యావందన మాచరింప వలదా చౌశీతి బంధమ్ములన్"

(మరల నిట్లు విడఁదీసి చదువును)

"సంధ్యావందనమా ! చరింపవలదా చౌశీతి బంధమ్ములన్"

(స్ఫురించినట్లు నటించి)

వింధ్యాద్రిప్రభనొప్పు బల్కుచములన్ వేపట్టి పెంపొందు కా
మాంధ్యంబార్పఁగలేక వెఱ్ఱివలె నేలా మంచి యీ రాతిరిన్
వంధ్యం జేసెదు ? కాముకేళియనఁగాఁ బాండిత్యమా ? లేక నీ
సంధ్యావందనమా ? చరింపవలదా చౌశీతి బంధమ్ములన్.

(అదంఱును చప్పట్లు కొట్టుదురు)

ఆచా : మీరు నిజముగాఁ బుంభావ సరస్వతులే.

మంత్రి : (తనలో) వీనికి ఇప్పటికి బుద్ధి వచ్చినట్లున్నది.

ప్రభు : మీ కవితా వినోదముతో మాకుఁ బ్రొద్దుగూడఁ దెలియుటలేదు. కానిండు. మొదటినుండియు మీ బండి కొంచెము శృంగారముపైపు వెడలుచున్నది. శృంగార సంబంధమైనదే ఒక ప్రశ్న నడిగెదను.

వేం : అభ్యంతర మేమున్నది ? ప్రశ్నింపుఁడు.

ప్రభు : స్త్రీలకు శృంగారరసోపయుక్తములైన అవయవములన్నియు నెదుటి భాగము లోనే యున్నవికదా. జడ మాత్రము వెనుక భాగములో నుండుటకు హేతు వేమి ?

వేం : రసికులకు రాఁదగిన సందేహము. వినుఁడు

పురుషాయిత మొనర్చు పూబోడి కటిమీఁద
నాట్యంబు సల్పు పుణ్యంబు కొఱకొ

తిరు : ఘన సితంబ స్థలంబను పెన్నిధానఁబు
బహుభద్రముగను గాపాడు కొఱకొ

వేం : తా నాశ్రయించు కాంతకు వెన్కభాగమ్ము
ననుగూడ సౌందర్య మునుచు కొఱకొ

తిరు : పదిమంది దృష్టులు పడిన 'కంటక' మంచు
నూహించి కన్పడకుండు కొఱకొ

వేం : వేణి కాంతల వెన్నంటి వ్రేలుచుండె
లేకయుండిన నిధువన లీల కుపచ
రించు నంగమ్ము లెదుటనే సంచరించు
దానికట్లుండ నే యుపద్రవము వచ్చె.

(అందఱు చప్పట్లు కొట్టుదురు)

ప్రభు : మీ సమాధానము చాల చమత్కారముగ నున్నది, కాని మీరు చెప్పిన కారణములు నిజములగునా ?

వేం : కవిత్వమనఁగాఁ జమత్కారముతోఁ గూడిన అబద్ధమేకదా ! ఇంకను మఱియొక అబద్ధమాడు మందురా ?

ప్రభు : చాలును. మీరెన్ని విధములుగ నైనను జెప్పఁగలరు. ఇంత వేగముగా నెట్లు చెప్పఁగలుగుచున్నారు.

వేం కామేశ్వరీ కటాక్షము.

శ్రీనాప్పారెడి సత్కవిత్వమునకై చేయూప శబ్దార్థముల్
నేనే వచ్చెద నేనె వచ్చెదను నేనే వత్తు నేవత్తు నే
నే నేనే యని వచ్చి మీఁదఁబడు మే మెద్దానిఁ గైకొందు మె
ద్దానిన్ వీడుదు మోయి రామ నృపతీ ! దాన ప్రధానాకృతీ !

ప్రభు : మీ సంబోధనము నా కర్తవ్యమును స్ఫురింపఁ జేసినది.

(మంత్రివైపు తిరిగి తలయూపును. మంత్రి చేయూపఁగా నొక సేవకుఁడు పళ్ళెరములోఁ బెట్టి బహుమానములు తెచ్చును. ఆ పళ్ళెరము ప్రభువు కవుల కొసఁగును.)

ఈ బహుమానము మీ కవితకు వెలకాదు. మా ఆనందమునకు చిహ్నము మాత్రమే.

తిరు : ప్రభూ ! మీ వంటి రసికశేఖరుని మెప్పింపఁ గల్గితిమి, సత్కవిత్వమునకు రసికుఁడు ప్రతిభకుఁ బాండిత్యము జోడగుట ఎక్కడనో కాని లభింపదు.

వినుమొకమాట చెప్పెదము వీనులకింపుగ నెల్లవారలన్
గని వినుతింపఁబోము పదిగంపల కెంపు లొసంగుఁగాక, లే
దని వినుతింప మానము రసాధికులన్ గవితామతల్లికిన్
ధనము ప్రధానమా ? రసికతా సుఖతల్ ప్రధానమా ?

ప్రభు ; మీ బోటి సత్కవుల నాదరించెడి భాగ్యము నాకుఁ గల్గినది. మరల మీ దర్శనము కల్గుఁగాక

(అని మంత్రి మొగమువైపు చూచును. అది గమనించి కవులు)

తిరు : వేం : ప్రభూ ! సెలవు.

(అందఱు నిష్క్రమింతురు)

ఇది తృతీయాంకము

# తిరుపతి వేంకటీయము

## చతుర్థాంకము

ప్రదేశము – మద్రాసు

(జయంతి రామయ్య పంతులు, వావిలికొలను సుబ్బారావు, కొమఱ్ఱాజు లక్ష్మణరావు, చెన్నాప్రెగ్గడ భానుమూర్తి వేటూరి ప్రభాకరశాస్త్రి, వేదము వేంకటరాయశాస్త్రి, దేవరాజ సుధీమణి, కావ్యకంఠ గణపతి, శతఘంటము వేంకటరంగశాస్త్రి, కొందఱు సభ్యులు.)

వావిలి : నేఁటి సభకు శ్రీ జయంతి రామయ్య పంతులుగారు అధ్యక్ష పీఠము నలంకరింతురు.

జయంతి : (నవ్వుచు) మీలో నే నొక్కఁడనే పండితుఁడు కానివాఁడను. కనుక మౌనముగా నుండుటకుఁదగిన స్థానమిచ్చినారు.

(కొప్పరపు సోదర కవులు ప్రవేశింతురు)

జయంతి : స్వాగతము.

శ్రీ వెలయు కొప్పరంపు పురీ నివాసు
లార ! రమణాఖ్య సుబ్బరాయాఖ్యులార !

సోదర కవీంద్రులార ! యశో నిధాను
లార ! స్వాగతమో యార్యులార ! మీకు

సోదరకవులు : పండిత మండలికిఁ బ్రణామములు.

(కవులు వారి మధ్యలోఁ గూర్చుందురు)

జయంతి : సభను ప్రారంభింతమా.

సుబ్బ : అట్లే.

(సోదరకవులు ఇష్టదేవతనుధ్యానము చేయుచుందురు)

సుబ్బ : ఓం శారదాయైనమః భక్తస్వర్గపి ! భార్గవి !

నీలాంబుజారామ కేళీ మరాళమై
సామేన శంకరస్వామి వెలయఁ
పవలు రాతిరి సేయు భద్రతాటంకముల్
దరహాస రుచి ధగ ధగ వెలుంగఁ
ద్రయ్యంతవేణి పద్మజురాణి హరిరాణి
చెలికారమునఁ గెలంకుల మెలంగఁ
గెంగేలి రాచిల్క క్రీడార్థ మెసరేఁగి
ప్రణవాక్షరార్థ ముపన్యసింపఁ

గ్రమ ముక్తాఫలామల గగన వాహి
నీ పయఃకణపంక్తి వందే యటంచు
విఘ్నపతి పూజన మొనర్ప విశ్వ భరణ
దీక్ష నెలకొన్న దేవి కిదే నమస్సు.

రమణకవి : ఓం అంబికాయైనమః

శ్రీరంజిల్ల శతావధాన మిచటన్ జేయంగ నూహించితిన్
బ్రారూఢిన్ నిను నమ్మి యిమ్మహిత సభ్యశ్రేణి మెచ్చంగ, నీ

కారుణ్యామృత బిందువుల్ చిలికి విఖ్యాతిన్ విడంబింపవే
ధారాశుద్ధి యు ధారణాధికతయున్ దార్కొ౯నగా శాంభవీ !

(అందఱు చప్పట్లు కొట్టెదరు)

కొమఱ్ఱాజు : సోదర కవులారా ! తమ యాశుకవితా విన్యాసములను గూర్చి పత్రిక లనేక విధములుగాఁ బ్రశంసించుచున్నవి. ఆ వార్తలు అతిశ యోక్తులు గావు కదా !

సుబ్బా : అయ్యా ? ముంజేతి కంకణమున కద్దమేల ? అద్దములోవలె ఉన్నది ఉన్నట్లుగఁ బ్రతిబింబింపఁ జేయుట పత్రికల సహజ లక్షణము కదా !

కొమర్రాజు : వార్తా పత్రికలను గూర్చి ఒక పద్యము చెప్పుఁడు.

సుబ్బా : చిత్తము.

ధూర్తుం దెల్పు నధూర్తునిం దెలుపు మందుందెల్పుఁ దెల్పుం బుధున్
హర్తం దెల్పును భర్తనుం దెలుపు న్యాయాన్యాయముల్ దెల్పు దు
ష్కీర్తుల్ దెల్పు సుకీర్తులం దెలుపు దుఃఖిం దెల్పుఁ దెల్పున్ సుఖిన్
వార్తాపత్రిక దాని లాభము లిఁకన్ వర్ణింపఁగా శక్యమే.

వేదము : అయ్యా ! వేంకట రమణ కవిగారూ ! అన్నిటికంటె రుచియైన పదార్థ మేదో చెప్పెదరా ?

రమణకవి : రుచి సంగతి యెట్లున్నను నాచేఁ బద్యము చెప్పించుట మీ యభిరుచి-

(అందఱు నవ్వుదురు)

రుచి వ్యక్తి నిష్ఠము కదా ! వినుఁడు

రమణి సుధాధరంబని కరంబనురక్తిని గాముకుల్, రమా
రమణ కథానులాపమని రాగ విరక్తులు మోక్షకాము లీ
క్రమమునఁ బల్కుచో నెదియుఁగాదు మహాకవి వర్య భవ్య వా
గమృతమె రుచ్యమంచు రసికాగ్రసరుల్ వచియింత్రు మిత్రమా !

వేటూరి : అయ్యా ! మీరు చెప్పుపద్యములను గలముతో వ్రాసికొందమన్న, మీ ధారావేగముతో సరిగా వ్రాయలేక పోవుచున్నాము.

సుబ్బా, ధారణాబల మున్నచోఁ గలము కాగితములతో నేమిపని ?

వేటూరి : కలము మేధావులకు అనవసరమనియా మీ తలంపు ?

జయంతి : (వేటూరితో) కలమును గూర్చి యీ కలకలమేల ?

(అవధానివైపు తిరిగి) కలమునుగూర్చి మీ అభిప్రాయమేమో సూటిగాఁ దెల్పుఁడు.

వేటూరి : నా ప్రశ్నముగూడ నదియే.

సుబ్బా : తప్పక తెల్పెదను. అవధరింపుఁడు.

కరము ద్విజిహ్వాల గరిమ గాంచుటఁ జేసి
యత్యగ్ర ఫణిరాజ మనఁగవచ్చు
నెమ్మి సువర్ణంబు నిర్మించుటను జేసి
యల శమంతకరత్న మనఁగవచ్చు
నీలోదకంబుచే నెగడు చుండుటఁ జేసి
యల యమునా నది యనఁవచ్చు
మంచి చెడ్డల నొక్క మాడ్కి నుండుటఁ జేసి
యాత్మార్థ విజ్ఞాని యనఁగ వచ్చు

కాగితములను నదులపైఁ గ్రాలుచుంటఁ
గలమనఁగ వచ్చుఁ గాన నీ కలము మహిమ
నెట్టు లూహింప నట్టులౌ యెవరి శక్య
మభినుతింప ? జయంతి రామయ కవీంద్ర !

దేవరాజ సుధీమణి : వేంకటరమణ కవిగారూ ! ఈ సమస్యను బూరింపుఁడు.

"రోమము సౌఖ్యమిచ్చుచును ప్రోవఁచో యశమెల్లఁ బాడగున్"

రమణకవి: నా పూరణము సుధీమణికి రోమహర్షణమును గలిగించుఁగాక. వినుఁడు.

భారత యుద్ధమునకుఁ బూర్వము అనాఁటి పౌరు లిట్లు భావించుచున్నారు.

ఏమొక పక్షమూనుకొను చేటికిఁ బౌరుల మాటఁ జేసి మా
కేమిట నైనఁ గష్టమొకయించుక రాదది యెట్టులన్న సం
గ్రామమునం జయంబుఁగొని కౌరవ పాండవులందు వీరొ వా
రో మము సౌఖ్య మిచ్చుచును బ్రోవనిచో యశమెల్లఁబాడగున్.

(అందఱు చప్పట్లుకొట్టుదురు)

శతఘంటము : సుబ్బరాయ కవిగారూ ! మీ సోదరుఁడు సమస్యా పూరణమును భారత యుద్ధ కాలమునాఁటికి తీసికొని పోయినాఁడు. ఆభారత యుద్ధము నందు ఈ నాఁటి గడియారమున్న ఎట్లుండెడిదో మీరూహించి చెప్పఁడు.

సుబ్బా : గడియారమునుగూర్చి యాలోచించుట వలననే మీగృహనామము శత ఘంటమైనది కాబోలు. వినుఁడు. భారత కథా కాలమునాఁడు గడియార మున్నచోఁగథ అడ్డము తిరిగెడిది.

గడియారం బుపయుక్త వస్తువుల నగ్రస్థానముం జెందు న
య్యెడు చంద్రార్కులఁగాననీక జలదంబుగ్రంబుగాఁ గ్రమ్మిన
య్యెడఁ గాలం బెఱింగిఁచు సైంధవునినాఁడీ యంత్రమే యున్నచోఁ
గడుఁ గష్టంబగుఁ గాదె ! గాండివి ప్రతిజ్ఞం దీర్పఁగాఁ జక్రికిన్.

(అందఱు చప్పట్లు కొటుదురు.)

వావిలికొలను : కవులారా ! "కరోమి, కవయామి, వయామి, యామి" ఇవి నాలుగు సంస్కృత క్రియలు గదా ! ఈ నాల్గు క్రియలు నాల్గు పాదములయందు వరుసగావచ్చునట్లు పద్యమును జెప్పఁడు. పదములకున్న అర్థము మారపలెను,

రమణకవి : తాత్పర్యము ఏ అంశము వచ్చునట్లుగా వర్ణింపుమందురు ?

వావిలి ; అర్థము భగవత్పరము కావలెను.

సుబ్బా : మీరు అర్థమును భగవత్పరము చేసిన మహానీయులు కదా !

చెన్నాప్రెగ్గడ : ఆంధ్ర వాల్మీకి గట్టి నియమములతో బంధించినారు.

కావ్యకంఠ : ముప్పది నిమేషములలో రెండు శతకములను జెప్పినవారి కిది యసాధ్యమని నేను భావింపను. ఈ సమస్య వీరి ప్రతిభకు నికష దృషదము.

(అందఱు కవులను జూచుచుందురు.)

సుబ్బా : పండితులార ! అవధరింపుఁడు.

గరిమన్ నిల్పక 'రోమిటారి' వలెఁ గుల్కన్‌సాగె దుర్మేధ, ధీ
వర హృత్సంకవ యామికుండు నిశఁ బ్రోవం జూచినట్లే యబో
ధ రహింపంగను దేవ ! యా మిడిని బొందన్ జేయకే, యెందు శ్రీ
ధర యామిన్యధిపాన్వయేశ ! సురవంద్యా ! కృష్ణా ! భక్తావనా !

(ఒక సభ్యుఁడు దప్ప అందఱు చప్పట్లు కొట్టుదురు.)

సభ్యుఁడు ; ఈ పద్యభావమేమియో నాకు బోధపడలేదు.

వావిలి : (సభ్యునితో జనాంతికముగా)

ఏమున్నది ? వెలవెలఁదివోలె నా మనము కుల్కుచుండెను. 'జనుల హృదయముపైఁ గల జవ్వాజిని రాత్రియందు రక్షకుఁడెట్లు కాపాడునో, అట్లే అజ్ఞానముతో గూడిన నా మనము గర్వము చెందకుండునట్లుగా కృష్ణా ! రక్షింపుము.' అని సారాంశము.

జయంతి : ఆ పదముల వెంత యద్భుతముగా మార్చినారు.

కావ్యకంఠ : ప్రతిభావంతులకు శబ్దములు మైనపు ముద్దలు గదా !

చెన్నప్రెగ్గడ : వేంకటరమణ కవిగారూ ! మనుచరిత్రలోని "ఇంతలు కన్నులుండ ..." అను పద్యమును భావము చెడకుండఁగ కందములోఁ జెప్పుఁడు.

రమణకవి : ఇంతలు కన్నులున్నను కందమే మీ కందమైనదా ?

వేదము : కవిగారిని ఆంధ్ర పితామహునితోఁ బోటీ పెట్టినారే ?

రమణకవి : పెద్దనవలెఁ గృతిచెప్పిన పెద్దనవలెగదా ! వినుఁడు,

ఇంతలు కనులుండఁగఁ బ్ర
శ్నింతువు వచ్చిన పథంబుఁ జెప్పుమనుచు శు
ద్ధాంత సతుల నిటు పల్కుట
యెంతకొ యిది వ్యాజమనుచు నేఁదలఁతు సుమీ

(అందఱు చప్పట్లు కొట్టెదరు)

కావ్యకంఠ : సోదర కవులారా ! మీరు వేంకట పురస్కులు. మీ కెన్నడును అప జయము కలుగదు. మీ సామర్థ్యము నిదివఱకే పరీక్షించితిని. కాని పృచ్ఛ కుఁడను గదా. అందులకై ఒక సమస్య నిచ్చుచుంటిని.

"ఫలముఁ దినందగునె చూత ఫలముం బోలెన్"

ఈ సమస్యను దమయంతి కథలో వచ్చునటుల పూరింపుఁడు.

సుబ్బ : అవధరింపుఁడు.

నలనామ మొనర నుగ్రా
నలుని వరింపంగ నెట్లు నాకొనఁగూడున్
ఫలమనిన మాత్ర ముక్తా
ఫలముఁ దినందగునె చూత ఫలముం బోలెన్

జయంతి : కవులారా ! మీ రసనలపై నేఁడు నాట్యము చేసిన రసదేవతకు నా మనః పూర్వక నమఃకారములు.

(పృచ్ఛకులవంకఁ దిరిగి)

పృచ్ఛకులారా ! ఇఁక ప్రశ్నలు వేయవలదు. వీరి కవితా శక్తికిఁ జెప్పిన పద్యములు చాలు.

పంచశరున్ విరాళి గొలుపంగల చేడెల వాడి చూడ్కులన్
గొంచెము విచ్చు జాజిపువుగుత్తుల నంటిన కమ్మతెమ్మెరన్
గాంచన గర్భురాణి కరకంజము నందలి చిల్క పల్కులన్
మించునుగాదె వీరి కమనీయ మహీయ కవిత్వ సంపదల్,

వావిలి : మీరన్నది నిజము. అదేమి చిత్రమో కాని

తడయరు ప్రశ్నం బడిగిన
తడవరు పల్కులకుఁ గాఁగఁ దడఁబడ రెపుడున్
నొడువుల మిడకరు తోఁపక
వడి వడి వచియింత్రు మున్న వల్లించినటుల్.

వేటూరి : ఈ సోదర కవుల యాశువు సాధారణమైనది కాదు.

ఆలోచించుటలేదు కల్పనకుఁ బద్యారంభ యత్నంబు ము
న్నేలేదించుక ప్రాసకేని యతికేనిన్ గొంకు గన్పట్టదే
యాలస్యంబును గల్గఁబోదు బళిరా యయ్యారె యివ్వారికిన్
బాలే యొఁ జుమి యాశుధార కవితా ప్రారంభ నిర్వాహముల్.

(ఇంతలో నొక సేవకుఁ డొక కాగితము నొసంగి నిష్క్రమించును)

జయంతి : (లేఖను బట్టుకొని) సభాసదులారా ! బ్రహ్మశ్రీ తిరుపతి వేంకటేశ్వర కవులు ఈ కొప్పరపు సోదర కవులను బ్రశంసించుచు గొన్ని పద్యములు వ్రాసి పంపిరి.

వేటూరి : మా గురుదేవుల పద్యములా ? చదువుఁడు.

జయంతి : ఇందు నవరత్నము లున్నవి. ముచ్చటగా మూఁడు పద్యములు మచ్చునకుఁ జదివెదను.

అయ్యా ! కొప్పరపుం గవీశ్వరులు ! మీ యాస్యంబు మేమెప్డదే
నొయ్యంజూడఁగ లేదు శిష్యుఁ డొకఁ డోహో యంచుమెచ్చెన్ మిమున్
వెయ్యాల్లియ్యఁగ శక్తిలేదు కొనుఁడీ వెయ్యాఋలేయంచు మే
మియ్యంబూనిన పద్దెముల్ మనుఁడి మీరెచ్చో నిరాఘాటులై

సరిగ శతావధానములు చక్కఁగఁ జేసెడివారు పూర్వమే
వఱలిరి నేఁడు లేరనెడి వార్తలు కల్లలు దివ్య వాగ్ ధురీ
భర పరిపూరి తాద్భుత సభాసదలంకరణ ప్రచారసుం
దరతరభావభావుక కన ద్భవదీయవధాన సంపదన్.

ఏమొక కొంతకాల మెదియే నొక తీరు శతావధానముల్
గ్రామములందుఁ బల్లెలను రాట్పుభలన్ మఱి రాజధానులన్
స్వామి కృపావిశేషమున సల్పినవాఁడము సల్పుచుంటి మిం
కేమగునో వచించి గౌదవీరఁ ధానఁరుద్భవించుటన్.

వావిలి : ఎంత చక్కని ప్రశంస.

సుబ్బ : ఈ పద్యములు వారి సౌజన్యమునకు నిదర్శనములు. అంతేకాని మా శక్తికిఁ గావు.

రమణకవి : "బోద్ధారో మత్సర గ్రస్తాః" అనునది వీరియెడల వర్తింపదు.

ఒరులన్ మెచ్చినచోఁ దన
పరువు చెడునటంచు నెంచు పద్ధతి నీర్ష్యా
కరమగు నీ కలివేళన్
బరమామోద మిడె మీ స్వభావంబు బళీ.

సుబ్బ : పూజ్యులగు శ్రీ తిరుపతి వేంకటేశ్వర కవులారా !
లాతిఁ బోని రసజ్ఞ శేఖరుల కుల్లాసంబు గల్పించి వి
ఖ్యాతిం జెందిన మీకుఁ బద్యములనీఁ గాంక్షించి నా మిచ్చి మీ
చేత : ప్రీతి ఘటింప నేరవయినన్ జేకొంద్రుగా కాప్తులై
శీతాంశో రమృతార్పణంబను నుడిం జింతించి ధీరోత్తముల్.

జయంతి : (వేటూరితో) సుబ్బరాయకవి యేదో తన్మయత్వము చెందుచున్నాఁడు.

సుబ్బ : జగదంబా ! నా యానందమును అక్షర రూపముతో సాక్షాత్కరింపఁ జేయుము. (వేటూరివంకఁ దిరిగి) నా అభువును ధారణ చేసి మీ గురుదేవులకందిమ్ము,

తిరుపతి వేంకటేశ్వర సుధీశ్వరులార ! మహేశ్వరీ కృపా
భరపరిలబ్ధ భవ్యమతివల్లభతా నత నర్వ సత్కవీ
శ్వర ధరణీశ్వరార్పిత లసత్ రసవత్ పద పద్యమందనా
దరణ గుణ ప్రభూత కవితా వనితా మహితానురాగ సుం

దరతర మూర్తులార ! రచితామృత కృత్ప్రథిత ప్రబంధ బం
ధురతర హృద్యపద్యచయతోషిత పండిత మండలీ సువృ
క్షరసిజ నిస్సరన్మధురసభ్రమకారి ముదశ్రువారి శీ
కర పరిషిక్త హస్త పటకల్పిత శీతల వాతపోత వి
స్ఫురిత తనూ సుఖాకలిత పుణ్యజన స్తుతి వాగ్విరావసం
భరిత సమస్తపట్టణ నివాస జనాంచిత మానసాంతరాం
కురిత నవానుమోద రసగుంభిత పద్యకవిత్వ మల్లికా
పరిమళితాష్ట దిక్కుహర భాసుర కేసరులార ! భూసురో
త్కర మణులార ! మిత్రజన తామరసాకరమిత్రులార ! సు
స్థిరపరమోపకార గుణసింధువులార ! శతావధాన ధీ
పరిణతులార ! పూజ్యకవిబాంధవులార ! విధేయుడైన సో
దర కవులిచ్చు వందన శతంబులివే కరుణన్ గ్రహించుఁడీ !

(అందఱు చప్పట్లు కొట్టుదురు)

– ఇది చతుర్థాంకము –

# తిరుపతి వేంకటీయము

## పంచమాంకము

ప్రదేశము - ఆత్మకూరు

(ప్రభువగు సీతారామ భూపాలుఁడు, ఆస్థాన పండితుఁడైన శ్రీనివాసాచారి, తిరుపతి వేంకటేశ్వర కవులు ప్రవేశింతురు)

వేం: ఇతోఽప్యధిక సంపత్తిః
ఇతోఽప్యధిక సంతతిః
ఇతోఽప్యధిక కీర్తిస్తే
సీతారామ మహీపతే.

తిరు: నవకాద్యుత్తమ మౌనిపూజిత పదాబ్జాతుండు కంసాది దు
ర్జన సంహారకుఁడార్త రక్షణ సమారంభ ప్రియంభావుకుం
డనిమిత్త ప్రసరత్కృపారసవిశేషాలంబియౌ నంద నం
దనుఁడైశ్వర్య మొసంగి ప్రోచుఁగాను సీతారామ భూపాలకా!

ప్రభు: కూర్చుండుఁడు. నా దర్శనమునకై మీరలెంతయో శ్రమపడితిరి. మీ కవితా వినోదముతోఁ గాలము గడపుటకు మాకుఁదీరిక లేదని మీకు బహు

మానము నందఁజేసినను దృష్టిఁ జెందక మా దర్శనమునకై పట్టుబట్టితిరి కదా !

వేం : క్షమింపుఁడు ప్రభూ ! ప్రభువుల మెప్పుబడయని కవిత కవిత గాదని మా యభిప్రాయము.

ఒక సంవత్సరమా మె నీ దయిన పేరూహించి యూహించి 'తా
రక మంత్రం'బవి నిష్ఠఁ బూని జపముం బ్రారంభముం జేసి నే
టికి సిద్ధించె ఎదీయ దేశ నృపకోటి శ్లాఘ్యమౌ రీవి విం
తకుఁ బాత్రంబగు నీవి చూపఁ బలె సీతారామ భూపాలకా !

శ్రీని : మీకవితలో నేమైన ప్రత్యేకత కలదా ?

తిరు : రుచి చూచిన మీకే తెలియఁగలదు. అడిగితిరి కాన చెప్పెదను.
కవితా కన్యక లెందఱేనిఁ గలరీ కాలమ్మునందల్ల వా
రు విచారింపఁగ గ్రుడ్డి కన్నుగలవారో కుంటివారో సురూ
ప విహీనాత్మలొ కాఁగలారు వివరింపన్ "సర్వ సంపన్న మా
కవితాకన్య" యటంచు నొక్కి పలుకఁగా నేల మీటోంట్లతోన్.

ప్రభు : మీ కవితాకన్య అంత అందమైనదా ?

శ్రీని : కాకిపిల్ల కాకికి ముద్దు.

తిరు : మా కవితా నర్తకి తాటియాకులలో ఆకులపాటు చెందునదికాదు. రసికుల రసనలే దీనిసొంత రంగస్థలము. పరీక్షచేసినఁగాని భేదము తెలియదుగదా.

పిక కాకములకు నొప్పిదమౌనె భేదమ్ము
స్వరముచేఁ గాక రూపమ్ము చేత
హంస బకములకు ననువౌనె భేదమ్ము
నడకచేఁ గాక వర్ణమ్ము చేత
నుప్పు కప్పురంబుల కొప్పునే భేదమ్ము
రుచులచేఁగాక స్వరూప గరిమ
స్ఫటిక వజ్రములకు స్ఫుటమౌనె భేదమ్ము
రంగుచేఁగాక భారమ్ము చేత

పండిత కవీంద్రులకును గేవల కవులకు
నలవియే భేదమెన్నంగ నలఘు తరప
రీక్షచేఁగాక వేఱొక రీతి చేత
నాత్మకూరుపురీరాజ ! యతులతేజ !

ప్రభు : సాధు సాధు. మీ పద్యము లక్ష్యలక్షణముగా నున్నది. మిమ్ములను జూడనిచో నా జీవితమునకు వెలితి గల్గెడిది.

వేం : ప్రభూ ! ఎంతమాట ? ఆ మాట మానోట రావలసినది. మిమ్ములను జూడనిచో మాకే వెలితిగాని మీకుగాదు.

శివుఁడెవ్వరికినైన సేవనీయుఁడు గాఁడె ?
వైష్ణవోత్తముల పాపమ్ముగాక
యబ్జుఁడెవ్వరికినై నానంద మీయఁడే ?
సరసీరుహముల దోషమ్ముగాక
మధు వెవ్వరికినైన మాననీయుఁడు గాఁడె ?
జాతి దౌర్భాగ్య లేశమ్ముగాక
విష్ణువెవ్వరికినైన వినతిపాత్రుఁడు గాఁడె ?
శైవుల దురదృష్ట సరణిగాక

మాదుదురదృష్టమునుబట్టి మమ్ముగార
వింపకున్నంతనే మీకు వెలితి యగునె ?
వితరణాపరభోజ ! పృథ్వీ బిడౌజ !
యాత్మకూరుపురీరాజ ! యతులతేజ !

శ్రీని : ఉపమానము లెంత జ్ఞానబోధకములై యున్నవి. కవులారా ! మీ కవితా శక్తి ఇనుము నయస్కాంతము లాగినట్లు మా మనములను లాగివేయు చున్నది.

తిరు : ఇప్పటికి మా కవితా కుమారి విలాసములలో ఏక దేశమును మాత్రమే చూచినారు. ఈ ఏక దేశముల సమాహారమే మా శతావధాన విలాసినీ విహారము.

ప్రభువు : ఏమీ ! మీ అవధానములలో అన్ని విలాసము లుండునా ! మీ రచనల యందు శ్రవణానందమును గూర్చి వింటిని.

వేం : ప్రభూ ! మా రచనలను మీకు విన్పింప వలెననియే మా యభిలాష.

దేవీ భాగవతాదిగ్రంధముల నెంతే యుక్తి నైపుణ్య లీ
లావైచిత్ర్యము లొప్పఁ గూర్చితిమి పోలంజూడ మీ బోంట్లు గా
కే వారింకఁ గలారు యోగ్యు లెపుడో యే వేళనో మీరు శ్రీ
ద్ధావిస్ఫూర్తి వినంగ మామనవి సీతారామ భూపాలకా !

తిరు : మీరే వినుటకుఁ దగినవారు.

పాండిత్యమ్మున మించి యింపగు కవిత్వం బొప్పువాఁ డెట్లు భూ
ఖండమ్మందున మృగ్యుఁడో విభవసాకల్యమ్మునం బొల్చి, బ్రి
హ్మాండమ్మై తగు విద్యచే నెగడి దానాధీనుఁడౌ రాజ మా
ర్తాండుండట్టులె, నీకుఁ బట్టె నిది సీతారామ భూపాలకా !

ఘనమత్తేభ గతుల్ చమత్కృతములౌ కందమ్ములున్ గీత ని
స్వనముల్ శోభన వర్ణధూర్వహత చంచత్ చంపకామోదమున్
సునవీనోత్పల మాలికా నికరముల్ శోభిల్లు మా కన్నె నీ
యనుగుం బ్రేమకుఁ బాత్రమై కొనుత రత్నాలంకృతుల్ భూవరా !

ప్రభు : మీ కవితాకుమారి శ్లేషాశ్లేషముతో నా యొడలు గగుర్పాటు చెందు చున్నది.

శ్రీని : (నవ్వుచు) మీరింత గొప్ప పండితులు గదా ! మీపాలు పండితులకు ఉండవచ్చునా ?

వేం : (కొంచెము కోపముతో)

దోసమటం చెఱింగియును దుందుడు కొప్పఁగఁ బెంచినార మీ
మీసము "రెండు భాషలకు మేమె కవీంద్రుల" మంచుఁ దెల్పఁగా
రోసము గల్గినన్ గవివరుల్ మముగెల్వఁడు గెల్తురేని యీ
మీసముఁదీసి మీ పదసమీపములన్ దలయుంచి మ్రొక్కమే.

శ్రీని : పండితులకుఁ గోపమును దెప్పించితిని. క్షమింపుఁడు.

ప్రభు : మీ కవితా కుమారితోపాటు మీ స్వభావమును గూడ ఆస్థాన పండితులు పరీక్షింపఁదలఁచి యిట్లనిరి. అన్యథా భావింపకుఁడు. "ప్రాయః స్వం మహిమానం క్షోభాత్ ప్రతి పద్యతే హి జనః" అన్నసూక్తి నెఱుఁగని వారు కారు గదా !

వేం : ప్రభువుల లౌకిక ప్రజ్ఞకు సంతసించితిమి.

శ్రీని : పండితులారా ! ఈ సమస్యను బూరింపుఁడు.

"మా కులదాస ! యెంత యభిమానము లేదుర చంద్రశేఖరా ?"

వేం : (నవ్వుచు) ఆచార్యులవారు శివనిందఁ జేయింపఁ దలఁచినారు. సరే కానిండు.

"నాకు విభూతిరాయఁ డొక నాయకుఁడా" యని నీదు భార్య ర
త్నాకరు చెట్టపట్టుటది యారసి యుండియు సిగ్గులేక ర
త్నాకరుఁ జంకఁ బెట్టుకొని యక్కట నట్ దలఁదాల్చి తౌర ! భా
మాకుఁదాస ! యెంత యభిమానము లేదుర ! చంద్రశేఖరా !

ప్రభు : చక్కని పూరణము. నేను గూడ నొక చిన్న సమస్య నిచ్చెదను, బూరింపుఁడు.

"గణ చతుర్థినాఁడు ఫణి చతుర్థి"

తిరు : ప్రభూ ! అవధరింపుఁడు.

"ఎన్ని దినములాయె నిట నన్నుఁడించి నీ
వరిగి" యనినఁ బత్నికనియె భర్త
"నేఁటి కెన్నఁగఁ బదినెలలాయెఁగా, నేఁడు
గణ చతుర్థి, నాఁడు ఫణి చతుర్థి"

ప్రభు : సంతోషము. మీ కవితా కుమారి యే రసమునందైనను రసిక రంజక స్వభావమును వీడదు.

వేంక : మారునది భావము. మారనిది స్వభావము.

శ్రీని : ఓహోహో! మాటలా యివి కావు ముత్యముల మూటలు.

(ప్రభువువంకఁ జూచి) ప్రభూ! ఇంక వీరి సామర్థ్యమునైననుమానించుట సరస్వతిని అవమానించుట యగును. వీరి మైత్రి వలె ప్రతిభా పాండిత్యములు వీరియందుఁ బెనవైచికొని యున్నవి. ఆధార లక్షణములు ఆధేయమున కబ్బుటకో విచిత్రమేమున్నది? వీరి నోటినుండి వచ్చు ప్రత్యక్షరముతో భారతి ప్రత్యక్షమగుచున్నది. వీరిని సత్కరించి "రాజుల సొమ్ము రాళ్ళపాలు" నెడి జనశ్రుతికి అపశ్రుతిని గల్గింపుఁడు.

వేం : అది అపశ్రుతి కాదు. లక్షణార్థముచే సుతశ్రుతమగును.

శ్రీని : ఎట్లు?

వేం : అవధరింపుఁడు.

"రాజుల సొమ్ము రాళ్ళ" కని బ్రాహ్మణుఁ డాడెడి మాట కర్థమో
రాజవరేణ్య! 'యెంతయుఁ దిరమ్ముగ రాళ్ళవలెఁ జెలంగు వి
భ్రాజిత సత్కృతీంద్రముల పాలి'ని లక్షణఁ జెప్పఁ జేసిరా
భోజుఁడు కృష్ణరాయలును బూర్వపు రాజగు విక్రమార్కుఁడున్.

శ్రీని : అద్భుతము

ప్రభు : ఆచార్యా! మీ ప్రశంస లింతయునుకొన్న కవుల నిదివఱకు నేఁ జూడలేదు. (కవులవంకఁ దిరిగి) పూజ్యులారా! శ్రీ తిరుపతి, వేంకటేశ్వరులారా! మీ శక్తిఁ జూచిన నాకొక యాశ పుట్టుచున్నది.

అస్మదాస్థాన విద్వాంసుఁడైన శ్రీని
వాస పండితుఁడన జగద్వర్ణనీయుఁ
డాయనయె మీ కవిత్వమ్ము నాదరించె
నహహా! మీచేతఁ గృతిని మేమందవలదె.

తిరు: వేం: ధన్యులము.

శ్రీని : చక్కని కోరిక కోరినారు (నవ్వుచు) ప్రభువులకుఁ గవితాసతి పాణిగ్రహణముపై ఆసక్తి కల్గినట్లున్నదే!

వేం : రాజులు నిత్యకల్యాణ ప్రియులుగదా !

శ్రీని : మీ శ్లేష సమయస్ఫూర్తితో రాణించుచున్నది.

తిరు : ప్రభూ ! ఏ గ్రంథము మీచేఁ దలయూపించి ధన్యమైనది ?

ప్రభు : శ్రీనివాస విలాసము మా కులదైవమగు శ్రీనివాసునిపై గీర్వాణభాషలో జెప్పఁబడిన గ్రంథము. ఆ గీర్వాణమునకు గీర్వాణ మెక్కువగదా ! మాబోంట్లకు లొంగదు. పైఁగా దానిని వ్రాసిన కవి సామాన్యుఁడు కాఁడు.

ఎవ్వాని వాగ్ధాటి యెంత చూచిన మేటి
పాటవంబున రైలు బండి సాటి
యెవ్వాని పదలీల యెంత చూచినఁజాల
మేలనం దగిన ముత్యాల మాల
యెవ్వాని బల్ యుక్తి యెంత చూచిన రక్తి
నొప్పారు భాష్యకృదుక్తి శక్తి
యెవ్వాని సాహితి యెంత చూచిన మితి
గనక చెన్నారు పాల్కుఱికిఁ బ్రతి

యతఁడు నవదుర్గ వంశామృతాంబు రాశి
చంద్రుఁడురు కీర్తిసాంద్రుఁ డతంద్రకవి మృ
గేంద్రుఁ డతిభక్తి పరిచితోపేంద్రుఁ డలరు
కృష్ణకవిసార్వభౌముఁ డుత్కృష్టతముఁడు

ఆ శ్రీనివాస విలాసము మాకు పరమ పూజ్యమైన గ్రంథము.

దానిఁ దెలిఁగించి మాకు న
మూనానందం బొనర్ప నుంకింపుఁడు మా
యానందమె మీకును బర
మానందమొసంగఁజాలు నఖిల విధములన్.

దానిలోఁ గల సంస్కృతపు శ్లేషలను రసవంతముగాఁదెలుఁగుఁ జేయుట ఉభయ భాషల యందు "నోహో"యని యనిపించుకొన్న మీకే శక్యము.

తనకు నాల్గు నిఘంటు పదములు వచ్చు
ననుచుఁ బదిమందికినిఁ దెలియంగ మాఱు
మూల పదములు గుప్పిన ముచ్చటగునె
ప్రతిపదమ్మున రసముట్టిఁపడినఁ గాక.

ఈ కృతి నెందఱో కవుల కిచ్చితిమి. కాని యెవ్వరును తెనుఁగుఁ జేసెదమంచు ముందునకు రాలేదు. ఎవరిచేతఁ బడిన రాణించునో వారి చేతనే పడినది. ఈ గ్రంథమును ఎట్లు వ్రాయవలెనో నేను మీకుఁ జెప్పుట "జలమును బల్లమువైపు పొమ్మ"ని చెప్పుటవంటిదగును.

శ్రవణా నంద మొనర్చిన
కవులు తమరు తమకు రసముగాఁ గవనముఁ జె
ప్పవలయునని బోధించుట
భువి వెన్నెల చల్లఁజేయు పోలిక గాదే!

(కర్పూర తాంబూలముతో నిర్వురకును వస్త్రము లొసఁగి సత్కరించును)

వేం : ప్రభూ! మా శక్తి సామర్థ్యములతో మీ యభిప్రాయానుసారముగా నాంధ్రీకరించి మిమ్ములను సంతోషింపఁ జేసెదము.

భవదీయమ్మగు నానతిన్ శుభగ శుంభద్డంబరారంభసం
భవగంభీర వచోనిగుంభములెఁ కర్పన్ గాళికా సత్కటా
క్షవిశేషమ్మునఁ దెల్గొనర్చికొని వేడ్కన్ గుర్మతి శ్రీశు ను
త్సవకాలమ్మున కేఁగుదెంచెదము సీతారామ భూపాలకా!

చెలులే దుర్మతు లాపయిం జదువు వాసిం బేర్చినం బట్టఁగాఁ
దలమే వారలనంచు నెంచి తన వక్త్రింబందుఁ బూఁబోణికిన్
నిలయం బేర్పడఁ జేసి తా జగములన్ నిర్మించు నప్పైన న
త్తలునిం బాయని ధాత ప్రోవుతను సీతారామ భూపాలునిన్.

తిరు : ప్రభూ ! మా వేంకటశాస్త్రి నోటినుండి గ్రంథ మప్పుడే యారంభమైనది. ద్వితీయవిఘ్న ముండరాదు. నేనును మొదలుపెట్టెదను

పతి కైకొన్న భుజంగ శేఖరత సంభావించి లోనెంచి బ
ల్కితపుండీతఁ డటంచు భ్రాంతిపడి చెల్మిన్ భర్త యర్ధాంగ సం
స్థితిఁ జెన్నొందిన మంచుగొండ యనుగుం జిన్నారి మేల్పట్టి సం
తత మైశ్వర్య మొసంగి ప్రోవుతను సీతారామ భూపాలునిన్.

ప్రభు : ధన్యుఁడను,

వేం : ప్రభూ మేము వచ్చి చాల దినములయినది.

వేసవి దగ్గరాయె మిము పీడఁటకున్ మనసొగ్గదాయె మా
వానము దూరమాయెఁ బరవాస మొనర్చుట భారమాయె మా
కోసము తల్లిదండ్రు లిదిగో నదిగోనని చూచుటయె వి
శ్వాసమెలర్పవే సెలవొసంగినఁ బోయెదమయ్య భూపఁరా !

ప్రభు : మంచిది.

శ్రీని : సత్కీర్తి ప్రాప్తిరస్తు.

— ఇది పంచమాంకము —

# తిరుపతి వేంకటీయము

## షష్ఠాంకము

(అవధాని మనుచరిత్రను జదువుచుండును)

అవ : ఉరుదరీ కుహర సుప్తోత్థ శార్దూలముల్
ఝురవారి శోణిత శంకఁ ద్రావ
వనకుంజ మధ్య శాద్వల చరన్మృగ పంక్తి
దావ పావక భీతిఁ దల్లడిల్ల
నాశ్రమాంతర భూరుహాగ్రముల్ మునికోటి
బద్ధ కాషాయ విభ్రాంతిఁ జూడ
ఘన సాను శృంగి శృంగాటకంబులఁ గాంచి
యమరులు హేమాద్రి యనుచు వ్రాలఁ

గాసెఁ బేశల రుచిఁ గింశుక ప్రవాళ
ఘుసృణ కిసలయ కంకేళి కుసుమగుచ్ఛ
బంధుజీవ జపారాగ బాంధవంబు
లన్నగంబున జరఠారుణాతపములు

(ఇంతలో నొకఁడు పత్రికను జేతఁబట్టుకొని ప్రవేశించును. అతనిని జూడకయే అవధాని మాటాడుచుండును.)

ర్మ : ప్రసిద్ధులైన పూర్వకవుల నెవరిని వదలలేదు.

వ ; ఎందులకు వదలును ? ఎంత పెద్దవారిఁ దిట్టిన అంత గొప్ప విమర్శ యగును గదా ! నన్నయమీఁద వ్రాసిన పద్యమును జదువుము.

ర్మ : బాధపడెదవేమో !

ఆంధ్ర లోకోపకారమ్ము నాచరింప
భారతమ్మును నన్నయభట్టు తెలుఁగుఁ
జేయుచున్నాఁడు సరియె: బడాయి కాక
తొలుత సంస్కృత పద్య మెందుకుఁ జెపుఁడి ?

వ ; శాంతం పాపం శాంతం పాపం. సంస్కృత మహా భారతమును ఆంధ్రీకరించిన నన్నయగారు తనకు సంస్కృతము వచ్చునని చాటుకొనవలసిన గతిపట్టినదా ? చాలు చాలు. చెట్టు చెడు కాలానకుఁ గుక్కమూతి పిందెలు పుట్టుననుట ఇదియే కాబోలు. (కొంచెమాగి) ఎవరు నాయనా ? యివి వ్రాసిన మహాకవి ? నీకీ పద్యములు నచ్చినవా ? కలికాలము

ర్మ : (నవ్వుచు) అవధానీ ! ఎంత చాదస్తుఁడవోయి. నీ మాత్రము గౌరవము ఆ పద్యములు వ్రాసిన వారికి లేదనియా ? ఆ మాటకు వచ్చిన నీకన్న ఎక్కువగా వారు పూర్వకవులను గౌరవింతురు.

నన్నయాదుల పట్ల మాకన్నఁ గూర్మి
కలుగు వారలు లేరు జగమ్మునందు

అని వారే చెప్పుకొనినారు, చమత్కారముగాఁ గ్రొత్త పద్ధతిలో వ్రాసినారు.

వ : పెద్దలను దిట్టుటయా క్రొత్త పద్ధతి. 'వారు' అని బహువచనము వాడుచున్నావు ? ఎవరు బాబూ ! ఆ భాష్యకర్తలు ?

ర్మ : వేంకట రామకృష్ణ కవులు,

వ : వీరెవరు ?

శర్మ : కూపస్థమండూకమువలె నుండు నీకెవరు తెలియును ? ఓలేటి వేంకటరామ శాస్త్రి, వేదుల రామకృష్ణశాస్త్రి యను జంటకవులు.

అవ : ఏ ప్రాంతమువారు ?

శర్మ : బుద్ధి తక్కువై నీ దగ్గఱ ఈ గొడవ యెత్తినందులకుఁ బ్రశ్నల వర్షము కురియించుచున్నావు సంగ్రహముగాఁ జెప్పెదను వినుము. పిఠాపురపు ఆస్థాన కవులు, వీరు అష్టావధాన శతావధానములు చేసినారు. సుమారు ముప్పది గ్రంథములు వ్రాసినారు. రచనలలోఁ గ్రొత్త పద్ధతి త్రొక్కుట యన్న వీరికి ఒక్కింత మక్కువ. వారిని గూర్చి వారు చెప్పుకొన్నది వినుము.

మద్రనగరాంధ్ర విద్వత్సమాజ దత్త
నూత్న విషయ క్రియాబ్ద రత్న ఖచిత
హేమ బిరుదాభిరాములు, రామకృష్ణ
రచయితలు పీఠపుర యువరాజ గురులు.

అవ : వీరికి శిష్యుఁడుగా నుండి యాయువరాజు బాగుపడినట్లే, వీరికి విద్యాదానము చేసి విందకుఁ గుఱియైన దెవరు ?

శర్మ : తెలియకుండఁగనే జరిగినది చెప్పితివి. తిరుపతి వేంకటేశ్వర కవుల నెఱుగుదువుకదా !

అవ : ఎఱుఁగుదును.

శర : వారి శిష్యులఁట.

అవ : "అఁట" యనుచుంటివేమి ?

శర్మ : వేంకరామకృష్ణ కవులలో నొకఁడగు వేంకటరామశాస్త్రి చెళ్లపిళ్ల వేంకటశాస్త్రిగారి వద్ద చదువుకొనెనఁట. కాని ఈ వేంకటరామశాస్త్రి చెళ్లపిళ్ల వారిని గురువుగా గౌరవింపలేదు.

అవ : నన్నయాదులే వీరికి లెక్కలేనప్పుడు వేంకటశాస్త్రి యొక లెక్కయా ?

శర్మ : నీ గొడవ నీది.

అవ : చెప్పుము.

శర్మ : వేంకటశాస్త్రిగారిని 'కాకి' యని నిందించుచు "కోకిల కాకము" అను శీర్షికతోఁ గొన్ని పద్యములు వ్రాసిరి. దానికి వేంకటశాస్త్రిగారెంతయో బాధపడిరి.

అవ : అపాత్రదానము చేసినందులకుఁ దగిన శిక్షయే లభించినది.

శర్మ : అనవసరముగాఁ బ్రతిభావంతులను నిందింపకుము.

అవ : సరే ! ఇటువంటి పాడు పద్యములు నీ నోటికివచ్చియే యుండునే.

శర్మ : (నవ్వుచు) అడుగుఏలో అంత వంకరత్రోవ ఎందులకు ? వచ్చును. వినుము.

కాకము గాయకుఁడఁట పికంబునకుం గురువంట తన్ను ను
శ్లోకులలోన వాకొనని లోఁము కోయిలపిల్లదంట తా
నే కడు ధర్మవర్తియఁట యిద్దగుణుండఁట, వింటిరయ్య యీ
సాంఘలటంచుఁ జెప్పుకొనసాగిరి లోకులు వింత వింతగన్.

కాకము తనకొక గురువని
యే కోయిల సెప్పు ? నైననేమి ? యసూయం
జేకొని పికముంగాకం
బే కరణినొ నిందలాడనే తలపోయున్

అవ : మీరు తప్పుడు త్రోవలఁ బడినారు, తరువాత,

శర్మ : దానితో సాహిత్యలోకమునందు పెద్ద దుమారము లేచినది. ఆ గురుశిష్యుల శక్తిసామర్థ్యములు, కవితాప్రతిభ అంతయు వ్యక్తి దూషణముల పాలైనది. ఆ వివాద విషయ ప్రతిరూపమే తిరుపతి వేంకటేశ్వర కవుల గీరతము. (కొంచెమాగి) ఇప్పుడా గొడవ మండి మండి చల్లారి పోయినదిలే.

అవ : ఈతఁడు వేంకటశాస్త్రిగారిని గురువుగా గౌరవింపనిచో వేంకటశాస్త్రికి లాభమే కాని నష్టములేదు.

శర్మ : అవధానీ! నీవు తెలియక మాటాడుచున్నావు ఈ వేంకట రామకృష్ణ కవులుగూడ అసాధారణ ప్రతిభావంతులు. సామాన్యులుకారు. వారి వైయక్తిక వివాదము తో మనకేమి పని? ఏదో స్వల్ప కారణమున వారికి వీరికి వివాదము వచ్చినను కవిత్వాంశమును బట్టి వారందఱు మనకు వంద్యులే.

అవ : నీవేదో సమర్థించెదవు కాని, శిష్యులు కానివారే తిరుపతి వేంకటేశ్వర కవులకు శిష్యులమని చెప్పుకొనుచుండఁగా నిజముగా శిష్యుఁడైన వాఁడట్లు చేయఁదగునా? కొప్పరపు కవులు తిరుపతి వేంకటేశ్వరులకు శిష్యులు కారుకదా! వారెంత భక్తి శ్రద్ధలతో వీరిని గౌరవించిరి. అట్లు తిరుపతి వేంకటేశ్వర కవులను ప్రశంసించుట వలన కొప్పరపు కవులకు విలువ హెచ్చినది గాని తగలేదే.

శర్మ : ఓయీ! అవధానీ! నీవు త్రేతాయుగమునాఁటి విషయములతో వాదించుచున్నావు.

అవ : అనఁగా నీ యుద్దేశమేమి? కొప్పరపు సోదరకవులు వీరిని గౌరవించుట అబద్ధమా?

శర్మ : ఈ దినము నీకు ఈ విషయములన్నియుఁ జెప్పుటకి నాకు నోరు పడిపోవును. "సంన్యాసి పెండ్లికి జుట్టు దగ్గరనుండి అప్పే" అనినట్లు నీకు ఈ గొడవ లేమియును దెలియవు కావున అన్నియు మొదటి నుండియు పూసగ్రుచ్చినట్లు చెప్పవలెను. సరే కానిమ్ము.

అవ : నేను చెప్పినది "ఊ" కొట్టిన ఈ ప్రశ్నలు వేయనుగదా?

శర్మ : సరేలే, వినుము. తిరుపతి వేంకట కవులు, కొప్పరపు కవులు మొదట పరస్పరము ఒకరి నొకరు గౌరవించుకొనినమాట నిజమే. ఎవఁడో ఒక తుంటరి ఏదో ఒక చిన్న అవకాశమును సాధనముగాఁ జేసికొని వివాద బీజము నాటినాఁడు. ఆ బీజమే మహావృక్షమై శాఖోపశాఖలై విషవాయు ప్రసారము కావించినది.

అవ : ఏకః పాపాని కురుతే ఫలంభుంక్తే మహాజనః.

శర్మ : అట్లు చిలికి చిలికి గాలివాన యైనది. సాహితీచర్చ సత్యలోకమునకుఁ బోయినది. ఆ స్థానమున శాఖాద్వేషములు ఆక్రమించు కొనినవి. ఆ శాఖా ప్రవాహములో మేధావులే కొట్టుకొని పోయినారు. విని కతీతముగా నున్న వారు లేకపోలేదు. కాని వారిని లెక్కించుటకు వ్రేళ్లకూడ నెక్కువగును. గుంటూరు పట్టణము మూఁడు మాసాలు ఈ యుభయ పక్షాలకుఁ గురుక్షేత్ర మైనది.

అవ : (విచారముతో) ఆహా ! కాలమెంత విపరీతమునకు దారి తీసినది. ఇప్పటి కైనను ఆ వివాదము శాంతించినదా ?

శర్మ : వెనుకటి పరిస్థితితోఁ జూచిన కొంత తగ్గినట్లే. ఈ వివాదము వలనఁగొన్ని లాభములు కల్గినవి. కొన్ని నష్టములు కల్గినవి.

అవ : వివాదము వలన లాభములు కూడ నున్నవా ?

శర్మ : అవును, ఉన్నవి. వీర లొకరినొకరు పద్యములతో దూషించుకొనుట వలనఁ బ్రజలకుఁ బద్యకవిత్వముపై ఆసక్తి పెరిగి యెందఱో పద్యకవులైనారు. ఇది లాభము. కాని శాఖాద్వేషములు హెచ్చైనవి. ఛీ ! ఛీ ! ఆ విషయము తలఁచుకొనిన గొప్ప గొప్పవారే ఎంత సంకుచితముగాఁ బ్రివర్తించిరో గుర్తుకు వచ్చి బాధ కలుగును.

అవ : ఈ ఒక్క అంశముతో నేను నీతో ఏకీభవించుచున్నాను. ఇది నిజముగాఁ బరితపింపఁదగిన యంశము. సరస్వతీ స్తనంధయులలో వైషమ్యము వచ్చుట శోచనీయాంశమే.

శర్మ : ఈ విషయము నందైనను జావద్తమును జూపక ఏకీభవించి నందులకు సంతోషము.

అవ : ఈ దినము ప్రొద్దుట ఎవరి మొగము చూచితినో అన్నియు పాడువార్తలే. అసలే లోకములోఁ బండితులకు గౌరవము నశించుచున్నది. దానికిఁ

దోడుగా వీరిట్లు బజారునఁబడిన స్వార్థపరులు సంతసించెదరేమోకాని సాహితీ ప్రియులకు మాత్రము బాధ కలుగును. (కొంచెమాగి) ఇంకేమైన పాడు వార్తలున్నవా ?

శర్మ : చెప్పునంత వఱకు నా ప్రాణము తీసి చివర కిట్లందువేమి ? నీ మాటల కేమిలే. నాకుఁ గ్రొత్తకాదు గదా నాకాలస్యమగుచున్నది. సెలవు.

(నిష్క్రమింతురు)

—ఇది విష్కంభము—

(వేంకటశాస్త్రి ప్రవేశించును)

వేం : ఏనుఁగు నెక్కినాము ధరణీంద్రులు మ్రొక్కఁగ నిక్కినాము స
న్మానము లందినాము బహుమానములన్ గ్రహించినార మె
వ్వానిని లెక్కవెట్ట కనివారణ దిగ్విజయం బొనర్చి ప్ర
జ్ఞానిధులంచుఁ బేరుగొనినారము నీ వలనన్ సరస్వతీ.

కాని ఏలకో ఈ దినము నా మనము ప్రియమగు వస్తువును బోగొట్టు కొనిన విధముగాఁ గలఁత జెందుచున్నది. కారణములేని కార్యముండ దందురు. ఎంత ఆలోచించినను గారణమా కన్పింపదు.

గతమేమోఁ గతియించెఁ గొంత అదియున్ గయ్యాలతోఁ గొంత శాం
తతతోఁ గొంత వృథాగఁ గొంత కవితానందమ్ముతోఁ గొంత యే
యితి కర్తవ్యము లేక కొంత యెటులో యీపై భవచ్చింతనా
మృతరక్తిం గలిగించి ప్రోవుమని కే లే మోడ్తుఁ గామేశ్వరీ.

తల్లీ ! సరస్వతీ ! నీ యనుగ్రహమువల్ల ఈ జన్మము కవితా వ్యవసాయముతో సాగిపోవుచున్నది.

పూర్వజన్మమునం బెట్టి పుట్టి యున్క
నబ్బె నాలుగక్కరములు "డబ్బుదస్క"
మబ్బు జనికన్న నిది పూజ్యమై రహించె
జన్మజన్మాలకీ సరస్వతినె గొలుతు.

(ఇంతలోఁ బింగళి లక్ష్మీకాంతము గ్రంథముతోఁ బ్రవేశించి నమస్కరించి కూర్చుండును)

వేం : లక్ష్మీకాంతము ! ఏమా గ్రంథము ?

లక్ష్మీ: పాండవవిజయ నాటకము.

వేం : నీ కెప్పుడు నాటకాల పిచ్చియే. సరే కాని నా మన మేలకో ప్రశాంతముగా లేదు. ఒక పద్యమును జదువుము.

కులము చెఱుపంగ నూర్వురు కొడుకు లేల
యొకఁడు చాలఁడె నీవంటి యుత్కలుండు
ఊర కుక్కలు పదివేలఁ చేరనేల
చాలదే వేటకై యొక్క జాగిలంబు

ఇది నీచోపమ కదా ! అది నా బుద్ధికి ....

వేం : ఉపమానము నందలి ధర్మము ప్రధానము కాని, ఉపమాన వస్తువు ప్రధానము కాదు. ఇది దోషమనిన వ్యాస వాల్మీకులకు దోషము నంట గట్టినవారల మగుదుము. (కొంచెమాగి) అయినను కువిమర్శలు చేయు ఈ పాడు కాలములో ఈ తిరుపతి యిట్లు వ్రాసిచచ్చినాఁడేమి !

(తెరలో సత్యనారాయణ యను విద్యార్థిని గూర్చి)

సత్యం. సత్యం.

లక్ష్మి : తిరుపతి పోయినాఁడు. రేపు సాయంకాలమునకు వచ్చును. నేను లక్ష్మి కాంతుఁడను.

వేం : అమంగళము ప్రతిహతమగుగాక.

(తనలో) నేను "ఇట్లు వ్రాసి చచ్చినాఁడేమి" యని యనఁగనే "సత్యం, సత్యం" అని అనుటయు, వెంటనే శిష్యుఁడు "తిరుపతి పోయి నాఁడు" అనుటయుఁ జూచిన నాకేదియో కలవర మెక్కువ యగు చున్నది.

(ప్రకాశముగా) లక్ష్మీకాంతం ! ఈ రోజున నన్నేమియు ప్రశ్నింప వలదు. ప్రశాంతంగా నుండనిమ్ము.

(లక్ష్మీకాంతము ప్రక్కన గూర్చుండి తనలోఁదాను చదువుకొను చుండును)

తల్లీ ! కామేశ్వరీ ! నా పద్యాబ్జములతో నీ పాదాబ్జమ్ము లారాధించిన కొంత చిత్తశాంతి కలుగును. నీవు నా కొసఁగిన ఆయుధ మిదియే కదా !

ఆశ్వాసాంతముదాఁక శ్రావ్యమగు కావ్యంబట్టులే జీవితం
బాశ్వాసాంతముదాఁక రమ్యమగుచో నాశాస్యమై నవ్యమై
శశ్వన్మంగళ సంగతంబునయి పశ్వచ్ఛ్రేయమై పొల్చునో
విశ్వేశీ! యిటు లొట సారెకిటు నా విజ్ఞప్తి కామేశ్వరీ!

(ఎడమ కన్ను అదరును. ఇంతలో నొకఁడు లేఖ వేంకటశాస్త్రి కందించును. అది చదువుచు వేంకటశాస్త్రి నిర్విణ్ణుఁ డగును)

వేం : హా! తిర్పతీ! హా ప్రథమ శిష్యా! నన్ను విడిచి నీవు ఒంటిగా స్వర్గమున కేఁగుటకు మనసెట్లు ఒప్పినది! హా! తిర్పతీ! (మూర్ఛిల్లును)

(లక్ష్మీకాంతము, వచ్చిన వ్యక్తి శుశ్రూషచేయఁగా నెమ్మదిగాఁ గూర్చుండును)

వేం : (మెల్లఁగాఁ జదువును)

గురుఁడు బ్రహ్మయశాస్త్రి కొనియాడు నెవనిఁ గ
ర్ణాట సీతారామునసాటిఁ జేసి
శోడి కలార్థులే ధూర్యహు తెల్వి కీ
ర్ష్య వహించి కలహంబు సలుపుచుండ్రు
ఎవఁ డెన్నఁడును బారమెలమి విప్పకయె వ్యా
కరణ పాండిత్య ప్రకర్షమూనె
నొరుఁడు నచ్చని నాదు గరువమ్ము సడలింపఁ
జాలె నెవ్వని మనీషాబలంబు

ఎవఁడు నా కెక్కుడయ్యు నాయెడలఁ గార
ణాంతరమ్మున గురుభావ మంతరంగ
మునసె కాక వెలికిఁ గూడఁ ననఁగఁ జేసె
నట్టి తిర్పతికవి దివి కరిగె నకట!

నాకన్న ధీ బలమ్మున
నే కాదు తనూబలమున నెంతయు హెచ్చౌ
లోకస్తుత్యుఁడు తిర్పతి
నాకన్నన్ మున్నె యెట్లు నాకము ముట్టెన్ ?

విధి యెంత బలవత్తరమైనది. "దైవం అన్యత్ర చిన్తయే" త్తనుట మా యెడల సత్యమైనది.

కలలోనైన "నతండు ముం" దనుచు "వెన్కన్ నే"నటంచున్ మదిన్
దలఁపంబో మతఁ డేను గూడ నెటులీ తాన్మారు చేకూరెనో

ఆలోచింపఁగా దానికొకటే కారణము నాకుఁ గన్పించుచున్నది.

బలవంతుండె మహోన్నతంపుఁ బదవిన్ బ్రాఁకంగ నర్హుండు దు
ర్బలుఁడో కాఁడటువంటివాఁడనుట సర్వత్రానుభూతంబకా.

తిర్పతీ ! నీవు పుణ్యాత్ముఁడవు. నేనే దురదృష్టవంతుఁడను.

మృతులం గూరిచి యేడ్పు పద్యములు నేనేనాఁడు జెప్పన్ మహా
మతి యో తిర్పతి సత్కవీ ! త్రిజగతీమాన్యాత్మ ! విక్టోరియా
సతిలోనౌ మృతులెల్ల నీకతననే స్వర్గంబధిష్ఠించిరే
నతి పాపాత్ముఁడ నాకు నీకతన లేవాలాటి సౌభాగ్యముల్.

లక్ష్మి : గురుదేవా ! సర్వజ్ఞులైన మీరు కూడ నిట్లు విలపించుట తగదు. వారెచ్చటకుఁ బోయిరి ? "నరః పతిత కాయోఽపి యశః కాయేన జీవతి" కదా!

వేం : ఎన్నియో సమస్యలను బూరించితిని. కాని ఈ దైవమిచ్చిన సమస్యను ఎవఁడు పూరింపఁగలఁడు ? (కొంచెమాగి)

అవును. అతఁడెక్కడకుఁ బోయినాఁడు ? రసికహృదయాబ్జాహర్పతీ ! తిర్పతీ ! నీ యశఃకాయము ఆంధ్రభాష యున్నంత వఱకు నిల్చియే యుండును.

అల దివాకరునకుఁ బోలె నస్తమయము
నుదయమునుగూడ నిజమున కుండఁబోవు
నీ యశఃకాయమున కని నే నెఱిఁగియుఁ
బామరతఁ జేసి విలపింప వలసె సఖుఁడ.

లక్ష్మి : స్వామీ ! ఆలస్యమగుచున్నది. మీరే యిష్టైన గురుపుత్త్రుఁడైన వేంకటావధానిని యఁక నోదార్పఁగల వారెవ్వరు ? వెళ్లుదము రండు.

వేం : అవును. ఆ చిరంజీవులను గలిసికొనవలెను.

(నిష్క్రమింతురు)

– ఇది షష్ఠాంకము –

# తిరుపతి వేంకటీయము

## సప్తమాంకము

(ప్రదేశము - బందరు జాషువా, కాటూరి ప్రవేశింతురు.)

కాటూరి : ఓహో ! ఫిరదౌసి కవిగారా ! నమస్కారము

జాషువా : నమస్కారము. క్షేమమా ?

కాటూరి : ఆ ! క్షేమమే. మీరు నిన్నటి సభలకు రాలేదేమి ?

జాషువా : నిన్ననే రావలసినది. కాని అనుకోకుండ నవాంతరములు వచ్చినవి. నా ప్రాణమంతయు నిక్కడనే యున్నది. నిన్న సభలు బాగుగా జరిగినవా ?

కాటూరి : చూచి ఆనందింపవలసినదే కాని చెప్పిన దాని యానందము కల్గునా ? అనుభూతులను వివరించుటకు మాటలకు శక్తియున్నదా !

జాషువా : నిజమే. కాని వాస్తవముకన్న ఊహాప్రపంచములో ఆనంద మెక్కువ గదా ! మీరు రేఖామాత్రముగనైనఁ జెప్పిన దాని సంపూర్ణ చిత్రము నూహించుకొని ఆనందించెదను.

కాటూరి : (నవ్వుచు) కవి యనిపించుకొన్నారు. సంగ్రహముగాఁ జెప్పెదను. వేంకటశాస్త్రిగారికిఁ జేయఁబడు షష్టిపూర్త్యుత్సవమునకు ఆంధ్రావని

వివిధ ప్రాంతముల నుండి పండితులు, కవులు, శిష్యులు, ప్రశిష్యులు, మిత్రులు, అభిమానులు; వారు వీ రననేల? ఎందఱో ఈ బందరు వచ్చినారు.

జాషువా: ఈ షష్టిపూర్తి మహోత్సవ మెన్ని దినము లుండును?

కాటూరి: రెండు రోజులు. అనఁగా ఈ శని, ఆదివారములు నిన్న శనివారము కదా! ఈ రోజుతో సమాప్తమగును. నిన్న ఉదయము ఎనిమిది గంటలకు వేంకటశాస్త్రిగారిని ధర్మపత్నీ సమేతముగా నూరేగించి సభాప్రదేశమునకుఁ దీసికొనివచ్చిరి.

జాషువా: సభ యెక్కడ?

కాటూరి: శ్రీరామా హైస్కూలులో.

జాషువా: నిన్న వచ్చినవారంద రున్నారా? నిన్నటి సభావిశేషము లేమి?

కాటూరి: ప్రస్తుతం బందఱు బందరులోనే యున్నారు. నిన్నటి ఉదయపు సభలో రావుబహదూరు శెట్టిపల్లి హనుమంతరావుగారు సన్మానపత్రమును జదివిరి. వేంకటశాస్త్రిగారికి వెండి "పాఁదాను", వెండి పొడుముడబ్బీ, వెండి సిరాబుడ్డి, కలము, చదరంగపు బరిణె మొదలగునవి సమర్పించిరి.

జాషువా: ఆయన అభిరుచులు శిష్యులకుఁ గ్రొత్తవి కావుకదా! తరువాత.

కాటూరి: వేదమంత్రములతోఁ బండితులు దంపతుల నాశీర్వదించిరి. ఏకాదశవర్ష ప్రాయుఁడగు వేంకటశాస్త్రిగారి యల్లుఁడు ఆశీర్వచన పనస ఘన జటలతోఁ జదివి సభ కాశ్చర్యమును గలిగించెను. కొందఱు ఘనాపాఠులు వేదార్థమును జెప్పిరి. ఇది ప్రొద్దుటి సభాకార్యక్రమ సంగ్రహ చరిత్ర.

జాషువా: అంతయు సూత్రప్రాయముగా లాగివేయుచున్నారే.

కాటూరి: వివరించి చెప్పుటకు నిది సమయము కాదుకదా. ఈనాఁటి సభకు వేళ యగుచున్నది. నాపై నెంతయో కార్యభారము మోపినారు.

జాషువా: నిజమే. అట్లే సాయంకాలపు సభావిశేషములనుగూడ సంక్షిప్తముగాఁ జెప్పుఁడు.

కాటూరి : సాయంకాలపు సభకు శ్రీయుత దేశోద్ధారక కాశీనాథుని నాగేశ్వరరావు గారు అధ్యక్ష స్థానము నలంకరించిరి. అధ్యక్షులు శాస్త్రిగారి సమర్థతను వివిధ విధములుగా వింగడించి విశదీకరించిరి. ఎందఱో అభిమానులు శాస్త్రిగారిని ధనకనకములతో సత్కరించిరి ఎందఱో పండిత కవులు పద్యములను జదివిరి. ఇఁక శిష్యుల గురుదక్షిణలను చెప్ప శక్యము కాదు.

జాషువా : మహాకావ్య విషయమును ఖండకావ్యముగాఁ జెప్పుచున్నారు.

కాటూరి : మనము ఖండకావ్య కవులము కదా.

జాషువా : అది సరే కాని నాకొక సందేహము.

కాటూరి : ఏమది ?

జాషువా : వేంకటశాస్త్రిగారి గురువులగు శ్రీ శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రిగారు సభకు వచ్చినారా ?

కాటూరి : వారు రాలేదు. కాని ఆశీర్వచనమును బంపిరి. రాకపోవుటకు కారణము మీరెఱుఁగుదురు.

జాషువా : అవును. నేఁటి కార్యక్రమ మెట్లుండునో ?

కాటూరి : (నవ్వుచు) తినఁబోవుచు రుచి నడిగెదరేల ? బయలుదేరుదుమా ?

జాషువా : బయలుదేరుదము.

(నిష్క్రమింతురు)

— ఇది విష్కంభము —

(ప్రదేశము - బందరు. ప్రభల లక్ష్మీనరసింహముగారు అధ్యక్ష స్థాన మందుందురు. మూఁడు ఆసనములు వేదికపై నుండును.)

ప్రభల : (లేచి) సభకు నమస్కారములు చారిత్రాత్మకమైన ఈ సభకు నే నధ్యక్షుఁడనగుట నా పూర్వజన్మ సుకృతమే కాని నా అర్హతకాదు. (కొంచెము ఆగి) కార్యక్రమమును ప్రారంభము చేసెదను.

కింకవీంద్ర ఘటా పంచానన, విద్వత్కవి, బాల కలానిధి, బాల సరస్వతీ త్యాది బిరుదాంకితులైన శ్రీశ్రీశ్రీ చెళ్లపిళ్ల వేంకటశాస్త్రిగారిని సభ నలంకరింప వలసినదిగాఁ ప్రార్థించుచున్నాను.

(సభ్యులు చప్పట్లు కొట్టుదురు - వేంకటశాస్త్రి మెల్లఁగా వేదిక కడకు వచ్చుచుండును.)

శిష్యులు : జయ జయ ! షష్టిపూర్తి పరిషత్పరమేశ్వర ! వేంకటేశ్వరా !
జయ జయ ! భారతీ వదన పద్మ దివాకర ! వేంకటేశ్వరా !
జయ జయ ! భావనావిభవసాగర శ్రీకర ! వేంకటేశ్వరా !
జయ జయ ! పూర్వ నవ్య కవిసంఘకృతాదర ! వేంకటేశ్వరా!

శ్రవణానంద విధాత ! గీరత విహారఖ్యాత ! కామేశ్వరీ
స్తవ సంభార ! మనోజ్ఞ మృచ్ఛకటికా సంచార ! కాశీ సహ
సృ విచార ప్రియ ! హర్షబుద్ధ సుచరిత్ర జ్ఞాన ధౌరేయ ! గ
ణ్యావధాన స్వన ! భారతా భరణ ! నానారాజ సందర్శనా !

(వేంకటశాస్త్రి కూర్చుండి ప్రక్కన "ఖాళీ"గా నున్న ఆసనమువైపు చూచి చింతించును. అది గమనించి శిష్యుఁడొకఁడిట్లు చదువును)

శిష్య : తిరుపతి లేక యాసనము తీర్చి వసింతునె షష్టిపూర్తికా
క్కఱుఁడ నటంచు వెల్తి గొనఁగాఁ దగదార్య! నిలింపులెల్లఁ దా
మరదమువట్ట నింద్రుఁ డనుయాయిగ బ్రహ్మ పురోగముండుగాఁ
దిరుపతి దివ్యరూప మరుదేరెను మీదగు షష్టిపూర్తికై.

(వేంకటశాస్త్రి కన్నులు తుడుచుకొనును)

ప్రభల : (లేచి) ఈ వేంకటశాస్త్రిగారు జగమెఱింగిన బ్రాహ్మణుఁడు ఈ మహనీయుని గూర్చి మీకు నేను వివరింపఁబూనుట దివామణిని దివ్వెతోఁ జూపించుట వంటి దగును. ఇఁక వీరి గ్రంథములను గూర్చి మాటాడుదు నన్న, ఆమూలాగ్రముగ వీరి గ్రంథములను బారాంతరములతోఁగూడ నప్పగించు శిష్యుల యెదుట హాస్యపాత్రుఁడ నగుదును. కావున నేనిపుడు మాటాలాడి విఫలుఁడనగుట కంటె మౌనముగా నుండి గౌరవమును బొందుట మేలు. ఇఁక సభ్యులకొక విన్నపము. ఈ దినము మాటాడుట కెందఱెందఱో వచ్చిరి. అందఱకు నవకాశము వచ్చుటకష్టమను సత్యమును సభ్యులకు వివరింప నవసరములేదు. చంద్ర చకోర న్యాయముతోనున్న మిమ్ములను విసిగింపక, వేంకటశాస్త్రిగారి ప్రథమ శిష్యుఁడగు బ్రహ్మశ్రీ తిరుపతిశాస్త్రిగారు వేంకటశాస్త్రిగారిపైఁ జెప్పిన పద్యములను జదివి ముగించెదను. ఈ పద్యములు శిష్యులు సమర్పింపఁబోవు ముత్యాల సరము నందు నాయకమణులై ప్రకాశించుఁగాక

వితతాత్మీయ శతావధాన కవితా విద్యాపయోరాశి సం
భృత శిష్యాంబుద వాఙ్మయామృత రసప్రీతాఖిలాంధ్ర క్షమా
ధృత రజ్యద్రసికావతంస కృతవందిస్తోత్ర మాలావిభూ
షితు మా వేంకటశాస్త్రి నేఁ బొగడెదన్ శిష్యస్వరూపమ్మునన్.

భవునిన్ భావపదారవింద భవుఁ జెల్వప్పిళ్ళ వంశార్ణవో
ద్భవునిన్ శాస్త్ర వదంవదా సహభవున్ భాస్వద్గవున్ సాహితీ
భవునిన్ మేఘగభీరవిస్ఫుటరవున్ ధైర్యప్రభా మేరువున్
గవితా సద్గురు వేంకయాభిదుని వక్కాణింతు నెక్కాలమున్.

(అందఱు చప్పట్లు కొట్టెదరు)

సభ్యులారా ! ఒక్కొక్కరు దయచేసి మీ విలువైన మనోభావములను అంతకంటె విలువైన కాలమును గమనించుచు నివేదింపఁ బ్రార్థన.

(అధ్యక్షుఁడు కూర్చుండును)

దివాకర్ల వేంకటావధాని : (నమస్కరించి యాశీర్వాదమును బొందును)

స్మరణీయుండగుఁగాక ! స్వీయ కవితా సామ్రాజ్య విస్ఫూర్తికిన్
గురుతాస్ఫూర్తి వహించి తోడి వడుగై కూలంకషంబైన ది
క్తరుణీ సేవిత సద్యశోరమకు భాగస్వామియౌ వేంకటే
శ్వరు రూపమ్మున నున్న తండ్రికి నమోవాకమ్ము లర్పించెదన్.

(వేంకటశాస్త్రి కౌఁగిలించుకొనును - సభ్యులు చప్పట్లు కొట్టుదురు)

వేలూరి శివరామశాస్త్రి : (నమస్కరించి ఆశీర్వాదమును బొందును.)

మోయఁగరాని వేదనను మూఁడు శతాబ్దులనుండి మూఁగయై
పోయిన యాంధ్రభారతిని బుట్టినతోనె వసంత మాసపున్
గోయిలఁ జేసి యెల్లెడల, గ్రుమ్మరఁజేసిన మేటి చెళ్ళపి
ళ్ళాయుడు వేంకటేశ కవిరాజు గ్రహించుత మా నమస్కృతుల్

ఎక్కడఁ జూచినన్ గవులె యెక్కడఁ జూడ శతావధానులే
యెక్కడఁ జూడ నాటకపు లెక్కడఁ జూడఁ బ్రబంధ కర్తలే
దిక్కరులంచుఁ బేర్పడిన తిర్పతి వేంకటసూరు లేఁగు నా
ప్రక్కల నెల్ల, నీ కడుపు పండినదమ్మ ! తెలుంగు దేశమా !

(అందఱు చప్పట్లు కొట్టెదరు)

జాషువా : (నమస్కరించి యాశీర్వాదమును బొందును)

గంటలు కొట్టి మీ మధుర కావ్యము లాంధ్రుల మేలుకొల్పి యిం
టింటను నాటుకొన్నవి కవీశ్వర ! కోతకు వచ్చియున్న మీ
పంటను గోసికొమ్ము, తిరుపత్యభిదానుఁడు లేఁడు భాగమున్
గొంటకు ఈ విచారమున గుందెదమింతకు వేంకటేశ్వరా !

తెలుఁగు జగాన నేఁడు గడిదేఱిన బాలకవీంద్రులెల్ల మీ
పలుకుల పందిటన్ జిగురుబట్టిన మొగ్గలు మీ వధాన కౌ

శలమున మాగిపోయిన దిశావలయమ్ము ప్రసన్న బుద్ధియై
వఁగొని మి కొసంగెదు నుపాయనముల్ గొనుమయ్య సత్కవీ!

(అందఱు చప్పట్లు కొట్టెదరు)

వెటూరి ప్రభాకరశాస్త్రి : (నమస్కరించి ఆశీర్వాదమును బొందును)

కొఁకులు వోని సత్కవన గుంభన మంతకు మించి బింకమున్
బొంకము గల్గఁగాఁ జవులు బొంపిరివోఁ బరియించు నేర్పు మా
వేంకటశాస్త్రి పండిత కవిప్రభు చక్కటిఁ దక్కఁ దక్కవి
ద్యాంకులమందు నెందుఁగలదా సకలాంధ్ర మహామహీస్థలిన్

(అందఱు చప్పట్లు కొట్టెదరు)

పర్వా వేంకటశేషయ్య : (నమస్కరించి యాశీర్వాదమును బొందును)

(సభ్యులవంకఁ దిరిగి) సభ్యులారా! నేను వ్రాసిన శశికళాస్వయంవర మను పద్యకావ్యమును ఈ శుభసమయమున గురుదేవులకు అంకితము చేయుచున్నాను.

(గ్రంథము వేంకటశాస్త్రి కొనఁగును. సభ్యులందఱు చప్పట్లు కొట్టుదురు)

విశ్వనాథ సత్యనారాయణ : (నమస్కరించి యాశీర్వాదమును బొందును)

పుడమిని బెక్కు సత్కవులు బుట్టిరి మట్టిరి సత్కవిత్వపున్
దొడిమలు చెళ్లపిళ్ల కవితోఁ దులఁదూగెడివారె ! వానలోఁ
దడియనివారు మద్గురువధానమ్మృదూక్తి మరంద ధారలోఁ
గడుగనివారు మాకెచటఁ గానఁగరారిలఁ దెల్గునాఁడులన్.

తనయెద యెల్ల మెత్తన కృత ప్రతి పద్యము నంతకంటె మె
త్తన తవ శిష్యులన్న నెడదంగల ప్రేముడి చెప్పలేని మె
త్తన యయి శత్రు పర్వత శతారము సత్కవి చెళ్లపిళ్ల వేం
కన గురువంచుఁ జెప్పికొనఁగా నది గొప్ప తెలుంగునాడునన్

(సభ్యులు చప్పట్లు కొట్టెదరు)

(పింగళి లక్ష్మీకాంతము, కాటూరి వెంకటేశ్వరరావు వచ్చి నమస్కరించి ఆశీర్వచనములను బొందుదురు.)

పింగళి : గురుదేవా! మీ షష్టిపూర్తి మహోత్సవ సందర్భమున మేము వ్రాసిన సౌందరనంద కావ్యమును మీకు గురుదక్షిణగా నొసఁగుచున్నాము.

భావ మొక్కఁడు గాఁగ భావన యొక్కఁడై
రసభావ పరిణతి యెసఁగఁ జేసి
సరసార్థ మొకఁడుగా శబ్ద మింకొకఁడయి
శబ్దార్థ సామరస్యము ఘటించి
సూత్ర మొక్కఁడు గాఁగ చిత్రణ మొక్కఁడై
ప్రాణవత్పాత్రముల్ పాదుకొల్పి
తెరయెత్తు టొకఁడుగాఁ దెరదించు టొక్కఁడై
రంగ నిర్వహణమ్ము రక్తి నిల్పి

సుందరీనంద జీవితానంద మట్లు
పరమమగు కోటికెక్కిన బంధుభావ
మిత్రభావము లిమ్మెయి మేళగించి
సృష్టి జేసితి మీకావ్య శిల్పమూర్తి.

కాటూరి : ఈ కావ్యమును మీ కంకితము చేయుటకు మా భక్తియే ప్రధాన కారణము. మఱేదియును గాదు.

కేతనతోడి పొత్తునకుఁ గేల్గలుపన్ దలపోసికాదు నీ
చేతము మెచ్చఁగాఁ గవిత చెప్పఁగ నేర్తు మటంచుఁగాదు వి
ఖ్యాతికిఁగా, దికేమనిన, నద్యతనాంధ్ర కవిప్రపంచ ని
ర్మాతకు భక్తిమై నుడుగఱల్ ఘటించెడి పూన్కియే సుమీ!

కృతికిన్ మీ గురువే మొసంగెనని మిమ్మేరేని ప్రశ్నింప, "స
త్కృతి మాకిట్టు లొనర్చె మా గురు" వటం చీపద్యముల్ చూపుఁ డ
ప్రతిమ ప్రజ్ఞులు సత్కవీశ్వరులు "విద్వాంస్తుష్ట" యన్ వాక్యమున్
స్మృతికెక్కించుక మిమ్ము మెత్తురు కడున్ మీ పూన్కి కగ్గించుచున్.

(పింగళి, కాటూరి నమస్కరించి వేదికను దిగి క్రిందకు వత్తురు)

(వేంకటశాస్త్రి సభవంకఁ దిరిగి) సభ్యులారా! మీరు చేసిన ఈ సత్కారములకు కృతజ్ఞతతో నమస్కారము చేయుటతప్ప మఱేవిధముగను మీ ఋణమును దీర్చికొనలేము.

అఱువది యేండ్లు నిండెననుటట్టులె యున్నను బైని మూఁడు, వ
త్సరములు దాఁటి నాలుగవ దానను మాసము లొక్క రెండొగిన్
జరిగెను నాకు నేఁటి, కిది సర్వము సత్యమ యౌట నేఁడిటన్
జరిగెడి షష్టిపూర్తియను సత్కృతికేఁ దగియుంటి నెంతయున్.

ఈ బందరు పట్టణము నాకుఁ గ్రొత్తది కాదు. వెనుక మా తిరుపతి వేంకటేశ్వరుల కవితా సామ్రాజ్యమునకు రాజధాని. ఓ బందరుపురీ!

నా ప్రేమమ్మును గోరి నా కిపుడనన్యాదృక్షమౌ సత్కృతిన్
శ్రీసంపన్నముగా నొనర్చెడి నినున్ శ్రేయస్సులెల్లప్పుడున్
భాసిల్లన్ నెగడించు గావుత! సదభ్యాసమ్ముచే నీ ప్రజల్
వాసిన్ గాంతురుగాత! బందరుపురీ! శాస్త్రవిద్యాశోభవైఖరీ!

(తెర పడును)

— ఇది సప్తమాంకము —

# తిరుపతి వేంకటీయము

## అష్టమాంకము

(ప్రదేశము - విజయవాడ. ముఖ్యమంత్రి శ్రీ పూసపాటి కుమారస్వామి రాజా, కాటూరి వేంకటేశ్వరరావు ప్రవేశింతురు)

కుమార : వేంకటేశ్వరరావుగారూ! సామాన్యముగాఁ బ్రసిద్ధ పత్రికలకు సంపాదకులుగా నుండుటవలనఁ గొందఱు ఈ లోకమునకుఁ బరిచయమగుదురు. కాని మీరు కృష్ణాపత్రికకు సంపాదకులగుటవలన దానికే విలువ హెచ్చినది. మీ సంపాదకీయములు రసవత్కావ్యములవలె మాటిమాటికిఁ జదువవలె ననిపించును.

కాటూరి : అభిమానులకు లోపములు కన్పింపవు. "మహాకవికి ఆస్థాన కవిస్థానము నొసఁగి గౌరవింపవలెను" అను మీ యాశయమునుబట్టియే మీ సాహిత్యాభిరుచి వెల్లడియగుచున్నది.

కుమార : మేము వేంకటశాస్త్రిగారిని ఆస్థానకవిచేయుట లాంఛనప్రాయమే. వారికి ఏనాఁడో ఆస్థానకవి పదవి జమకట్టఁబడినది.

కాటూరి : నిజమే కాని గుణగ్రహణపారీణులగు అధికారులు మీవలె లోకములో ఎందఱున్నారు? అదికారులకు ఆశ్రితపక్షపాత మున్నంత గుణపక్షపాత ముండుట దుర్లభము.

కుమార : మీరన్నది కాదనుట కష్టమే. కాని అధికారి సర్వజ్ఞుఁడని భావించుట కూడఁ బొరపాటే యగును ఎంతవఱకో ఎందులకు ? ఈ వేంకటశాస్త్రిగారి గొప్పతనము తెలిసికొనుటకు నాకు శక్తియున్నదా ? ప్రస్తావన వచ్చినది గాన అడుగుచుంటిని. వీరి కవితాశక్తిని గూర్చి సంగ్రహముగా ఒక వాక్యములో నాకుఁ జెప్పుఁడు.

కాటూరి : వాక్యమనిన గుర్తువచ్చినది. మా గురుదేవులను గూర్చి ఆంధ్రదేశములోఁ గల ప్రసిద్ధ పండితులెల్లరు తమ యభిప్రాయములను వెలిబుచ్చిరి. కాని మా ముట్నూరు కృష్ణారావు చెప్పిన వాక్యము ముందు అవి యన్నియు దిష్టిబొమ్మలైనవి. అది వాక్యముకాదు. బ్రహ్మసూత్రము.

కుమార : ఏమా వాక్యము ?

కాటూరి : "వీరి కవిత్వము ప్రాచీన కవిత్వమునకు భరత వాక్యము, నవీన కవిత్వమునకు నాంది."

కుమార : మీరన్నట్లు నిజముగా ఈ వాక్యము బ్రహ్మసూత్రమే. అక్షరలక్షలీయఁ దగినది. ఇట్టి మహాకవియుని గౌరవించుటచే నా జన్మము ధన్యమైనది. నాకీ అవకాశమొసంగిన పరమేశ్వరునకు నా నమస్కృతులు నా రాజకీయ జీవిత గ్రంథములో ఈ దినమే విలువగల పుట. శాస్త్రిగారి జీవిత చరిత్రలో నన్నుఁగూర్చి ఒక పంక్తియైన వ్రాయక తప్పదుగదా! నేను చాల అదృష్టవంతుఁడను.

కాటూరి : ఈ పుంభావ సరస్వతిని సత్కరించుటకుఁ దగిన సమయములో బ్రహ్మ తగిన వ్యక్తికి అధికార మొసఁగినాఁడు. మణివలన వలయము, వలయము వలన మణి ప్రకాశించినట్లు మీవలన వారు, వారివలన మీరు సాహిత్య ప్రపంచములోఁ బ్రకాశించెదరు.

కుమార : లగ్నమునకు వేళ యగుచున్నదే!

కాటూరి : పల్లకీ బయలుదేరినది. (కొంచెమాగి) అరుగో వచ్చుచున్నారు.

(రాజలాంఛనములగు పగటి దివ్వటీలు, రాజదండము పట్టుకొని సేవకులు ముందు వచ్చుచుండ, పింగళి శ్వేతచ్ఛత్రమును బట్టుచుండ, వేటూరి, రాయప్రోలు వింజామరలతో విసరుచుండ, పండితులు వేదపఠనమును జేయుచుండ పల్లకీనుండి వేంకటశాస్త్రి దిగి సభాభవనమున శిష్యుల చేయూతలచే ప్రవేశించుచుండును).

కుమార : (తనలో) ఆహా ! ఏమీ ఈ కవివరేణ్యుని భాగ్యము. ఆంధ్ర దేశములోఁగల విద్వాంసులెల్ల రీయనకు సేవకులై వర్తించుచున్నారే! ఈ శిష్యుల భక్తిశ్రద్ధలు సూచిన మాకు లోకమున జరుగు కృత్రిమ గౌరవములపై అసహ్యము కల్గుచున్నది. అవును. "సుకవితా యద్యస్తి రాజ్యేన కిం ?" అని పల్కినవారు వెఱ్ఱులా ?

(ఎదురేఁగి – ప్రకాశముగా)

విద్వత్కవి : స్వాగతము. ఈ యాసనము నలంకరింపుఁడు.

(అందఱును గూర్చుందురు)

కుమార : సభ్యులారా ! నేఁటి ఈ సభలో భాషాదేవి కొలువుదీర్చినది. మా ఆనందమునకు అవధి లేదు. (వేంకటేశ్వరరావుగారి వంకఁ దిరిగి)

వేంకటేశ్వరరావుగారూ ! మీ స్వాగత పత్రముతోఁ గార్యక్రమమును బ్రారంభింపుఁడు.

కాటూరి : "కవనార్థమ్ముదయించితిన్ సుకవితా కార్యంబు నా వృత్తి ఈ
భవమద్దానఁ దరింతు తద్భవమ మద్భాగ్యంబు సర్వంబు, మృ
త్యువు నేఁదాన జయించితిన్ రుజ జయింతున్ దానిచే"నన్న స
త్కవితా దేశిక దేశికుం గొలుతు స్వాంతంబందు వాక్సిద్ధికై

కింకవీంద్ర ఘటా పంచానన ! తుభ్యం నమోస్తు.
ఆధునికాంధ్ర సాహిత్య మాధవీ పుంస్కోకిలా ! జయము జయము.
బ్రహ్మపదావతీర్ణ కవితా లీలావతీ వల్లభా ! జయము జయము.

శత శతానేక శతావధాన మరంద ధారాధోరణీ సమ్మోహితాంధ్ర క్షమా మండలా ! జయము జయము.

చరణ పీఠోపకంఠ నృత్యమాన ద్రుహిణ కలకంఠీ మంజు మంజీర శింజాన రంజితాంతఃకరణా ! జయము జయము.

సువిశాల ఫాలాంకిత కాశ్మీర ముద్రాముద్రిత కామేశ్వరీ కటాక్ష వీక్షా శుభక్షణీ సంకాశ భ్రూమధ్యాంతరంగా ! జయము జయము.

కంప్రవక్ష - నమ్రనేత్రపత్ర - ఫలంఫలిత రత్న కటక వాగ్దేవీ వీజ్యమాన రమ్యాతిరమ్య కవితారస భావ భావనోద్రిక్త ప్రస్విన్న భస్మ త్రిపుండ్రాంకిత లలాటా ! జయము. జయము.

వాణీ నఖముఖ ముఖరిత వీణానిక్వాణ విమల వీథీ విహారా ! నవీన చతుర్ముఖా ! జయము జయము.

ప్రగల్భ శిష్యానేక గురూ ! జయము జయము.
అఖిలాంధ్ర మహాకవీ ! జయము జయము

(కాటూరి నమస్కరించి కూర్చుండును ముఖ్యమంత్రి వేంకటశాస్త్రికి వస్త్రము లొసఁగును సభ్యులు కరతాళధ్వనులు చేయుదురు. ప్రభుత్వాంధ్రాస్థాన కవికి జై అని సభ్యులు జయవెట్టుదురు.)

దివాకర్ల వేంకటవధాని : (నమస్కరించి పంచరత్నములు చదువును)

ప్రథితుల్ పూర్వనరేంద్రు లాత్మ సభలన్ ప్రఖ్యాత విద్వత్కవి
ప్రథ గల్గించి విశేష కీర్తి గనినారల్ మంత్రివర్గంబు త
త్ప్రథమున్ ద్రొక్కెను నేఁడు క్రమ్మఱఁ బ్రజాస్వామ్య ప్రభాశాంకిత
ప్రథమాస్థాన కవీంద్ర ! నీ కివె నమో వాకమ్ము లర్పించెదన్

జమకట్టెన్ దమకెన్నఁడో సుకవితా సామ్రాజ్య పట్టాభిషే
కము నాంధ్రప్రజ మానసంబుననె సంకల్పించి యీ నాఁటికిన్
దమ భావమ్మున కొక్క రూపమిది సంభావింపఁగాఁ జాలు భా
గ్యము సిద్ధించెఁ బునాది యౌచుఁ గవిలోక ప్రీతి పర్యాప్తికిన్.

ఒక కావ్యమ్మొ రచించి నీ ప్రథమ శిష్యుండున్నచో నేఁడు తా
వక పాదద్వయిను౦చి యేపగిది సంభావించునో యంచు నిం
చుక చింతించితిఁ గాని వెంటనే మనస్స్వన్ ద్రిప్పె భాషాది నా
యకులై మించిన తక్కు శిష్యుల వచోవ్యాపారవిన్యాసముల్.

శివరాముల్ సువచోభిరాములును లక్ష్మీకాంతు లుద్యద్యశ
స్తవనీయాత్ములు విశ్వనాథులును విస్తార ప్రభావోన్నతుల్
భవదీయ ప్రియశిష్య పుంగవులు విశ్వారాధ్యు లీ దేశ వై
భవమున్ జూచుచు దిద్దుకోగలరు నీ పాదమ్ము లర్చించుచున్.

నీకు మాకు నుపాస్యయై నిఖిల జగము
నేలునట్టి పరాంబికయే ఘటించు
నామయ నిరాసనమ్ము నీ కనఘ ! యింక
నీ కృపాదృష్టి మమ్ము వర్ధిల్లించుఁ గాక.

(నమస్కరించి పత్రము వేంకటశాస్త్రి కిచ్చును. సభ్యులు చప్పట్లు కొట్టెదరు. అందఱును వేంకటశాస్త్రి వంకఁ జూచుచుందురు)

వేంకటశాస్త్రి : (హీనకంఠస్వరముతో)

సభ్యులారా ! నేను అశీతిని సమీపించుచున్నవాఁడను. కూర్చుండియే మాటాడుదును. ఈ ప్రభుత్వాంధ్రాస్థానకవి పట్టము జీర్ణప్రాయ దేహుండ నగు నన్ను ఈ వయసులో స్వయంవరమున వరించి వచ్చిన చందమున నా శయ్యాగారమునకే వచ్చి పాణిగ్రహణం బొనర్చినది. అంతయు ఆ కామేశ్వరీ కటాక్షము.

నేను తగుదునొ తగనొ ఈ స్థానమునకు
నాకుఁ దెలియదు పదిమంది నన్ను నిచట
గూరుచుండఁ బెట్టిన నిటఁ గూరుచుంటి
నర్హతానర్హతలు మీర లరయవలయు.

నన్ను వృద్ధుఁడంచుఁ బున్నెమ్మునకు మీరు
గౌరవింతు రే నుదారమైన
మీ సపర్య లెలమి మెచ్చి కైకొనియెదఁ
గవిని నేను కాను కాను కాను.

కామేశ్వరీ :

అనుకంపామృతదృష్టినించి నను నీ వాస్థాన విద్వత్కవీం
ద్రుని గావించితివి నేను దత్పదవి యందున్ గూరుచుండంగ నే
ర్తునె మందిచ్చితి తేనెఁగూడ నిరుమందున్ నిన్నె, యీ దృగ్విషక్
ఘనులన్ మాదృశ రుగ్ణులన్ గలరుసూ : కల్యాణి : కామేశ్వరీ

కవులెల్లన్ జయపెట్టు వైభవ మొసంగన్ లేదొ ? సచ్ఛిష్య వ
ర్గవిభూతిన్ గరుణింపవో తను జనుర్భాగ్యంబుఁ గై సేయవో
వివిధైశ్వర్యము లిచ్చితింక నొకఁడే విశ్వేశి : నీ సన్నిధిన్
గవిగానుండ ననుగ్రహింపు మిదియే కామ్యంబు కామేశ్వరీ :

ఇంతకన్నను నాకుఁ గావలసిన దేమున్నది. అయిన నిట్లగుఁగాక

(భరత వాక్యము)

కలుగుంగాక : యశమ్మునం బ్రజలకుం గాఢానురాగంబు, భా
సిలెడుంగాక : సుఖమ్ములెల్లరకు, సుశ్రీ యెల్ల దేశమ్ములన్
వెలయుంగాక : యపాత్రులైన కుకవుల్ వేవే పరాభూతులై
తలవంపున్ గయికొంద్రుగాక : బుతమే దైవారుఁగా కెల్లెడన్

(ఇది అష్టమాంకము)

సమాప్తము